# Bobbili Yuddha Natakam

Kaviraz S. Krishnamurty Sastry

శ్రీ పా ద సు ద ర్శ న సు ధ

శ్లో॥ శ్రీపాదకృష్ణః విగాట్యుత్రీయం నవవాప్తి

సుధీ స్సుదర్శనో మ్నా లౌ గేస్మి న్నీది

# శ్రీభద్రాచలరామ చరిత్రము.

ఇందు సంగ్రహముగా శ్రీరామచరిత్రము, భద్రునిచరిత్రము, భద్రాచలప
దమ్మక్క కథ, రామదాసుకథ, అక్కన్న మాదన్నలకథ, తానీషాకథ, కబీ
కథ, నారద వాల్మీకాదులకథలు, భక్తుడైన రమణబ్రహ్మచారికథ, మహాక్షే
ప్రభావము, సేవావిశేషములు, మిగుల మనోహరముగా నతిసులభశైలిని వర్ణింపఁబ
భద్రునకును నారదునకు జరిగినసంభాషణ మతివిచిత్రము. దమ్మక్కను ఆమె క
నకును శ్రీరాముఁడు ప్రత్యక్షమగుపట్ల మిక్కిలి యానందము. రామదాసు బా
మొదలు తహశీలుదారీ చేయుకాలములో నతనిరామభక్తి మిగులకమనీయము.
షాకు రామలక్ష్మణులు భటులరూపమున ప్రత్యక్షమగుట చిత్రము. కబీరునకు
రూపమున రాముఁడు ప్రత్యక్షమగుట మనోహరము. నారదుని పూర్వజన్మవృ
మాశ్చర్యము. వాల్మీకుల వ్యాధరూపము భయంకరము, రమణబ్రహ్మచారికి
రూపములతో రాముడు ప్రత్యక్షమగుట దర్శనీయము. ఇట్టిపుస్తక మింతవరకె
ను బయలువెడలియుండలేదు. కవిరాజుగారు స్వయముగా భద్రాచలమువెళ్లి ఆ
సంగతులన్నియు నెఱింగి గ్రంథము లరసిచెప్పినట్లు నారాగ్రంథాంతమందు.

మ. కనులారంగని భద్రశైలమున వే ♦ డ్కంగాంచిలు శ్రీరామభ
ద్రుని వృత్తాంతమదంతయున్విని జగ ♦ త్పూజ్యప్రబంధాళిఁ బూ
ల్చిన మార్గంబును సంతరించియును నే ♦ సిద్ధార్థి మాఘంబునన్
చనరం జేసితి నీప్రబంధము బుధా ♦ నందంబునం బొందఁగన్.

పోష్టేజి వేఱు. వెల రు. 1—

వలయువారు :—

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
రాజమండ్రి

---

శ్రీ

# బొబ్బిలియుద్ధనాటకము.

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ప్రణీతము.

నాల్గవకూర్పు 3000 కాపీలు

డి. వి. రమణారావుగారిచే

శ్రీ విద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రాజమహేంద్రవరము.

1922



[వెల 1 రూపాయి.

## ఈనాటకమునవచ్చు పాత్రములు

### పురుషులు.

రంగారాయఁడు——(కథానాయకుఁడు)

ఇనుగంటి నరసారాయఁడు——(మంత్రి& సేనాని)

దామెరధర్మారాయఁడు——(ఉపమంత్రి)

వెంగళరాయఁడు——(రాజుతమ్ముఁడు)

తాండ్రపాపయ్య——(రాజుబావమఱఁది)

చెలికాని వెంకయ్య
మంతెనబుచ్చన్న
కాకర్లపూడి వెంకటరాజు



ప్రధానయోధులు.

రాముఁడు
భీముఁడు



(కాసాలు)

రాయబారి——(విజయనగరము సంబంధుఁడు)

బుస్సీ——(ఫ్రెంచిగవర్నరు)

హైదరుజంగు——(బుస్సీమంత్రి)

విజయరామరాజు——(విజయనగరమురాజు)

మర్తిన్——(గోరుదొరమిత్రుఁడు.)

లక్ష్మన్న——(బుస్సీదుబాసి)

షారకాలాలు——(హైదరుసంబంధులు)

హాసవల్లీఖాన్——(హైదరుసేనాని)

పురోహితుఁడు

చినవెంకటరావు——(రాజుకొడుకు)

భటులు——స్త్రీవేషధరులు

వృద్ధకంచుకి

మఱికొందఱు భటులు మొదలగువారు

### స్త్రీలు.

మల్లమాంబ——(రాజపత్ని)

దాసీలక్ష్మి.

# నాల్గవకూర్పు పీఠిక.

---

ఇక్కాలంబునంగల కవులకుఁ దమ గ్రంథములఁ బీఠికలువ్రాయుట యందగు నానంద మింతయని చెప్పశక్యము కాదనుమాట సర్వజనవిదితమే. అందు నారచించిన బొబ్బిలియుద్ధనాటకము మనయాంధ్రదేశమందుఁ జరిత్రాత్మకమై పవిత్రమయిన మహానాటకంబగుటంజేసి యెప్పటికప్పుడు నవనవత్వమునుబొంది యెన్నిమాఱులు ప్రవర్తించినను ప్రేక్షకులకును, ప్రదర్శకులకును మహానందమును బొందించుచు, మహానాటకములలో నగ్రగణ్యతను గాంచుచున్నదని చెప్పుట యతిశయోక్తి కాఁజాలదు. అట్టి దీనికిఁ బీఠికవ్రాయుటయందు నాకు మిక్కిలి సంతోషమైన నీనాల్గవకూర్పునకీపీఠిక వ్రాయుచున్నప్పుడు నాకు సంతోషమునకు మాఱుగ దుఃఖమే సంభవించినది. నావిపరీతదైవంబునం జేసి తొమ్మిదిసంవత్సరముల యీడుగల నాయేకపుత్రుండు సుదర్శనసుధి నేఁటికి మూఁడుమాసములక్రిందట నకాలమరణము నొందినాఁడు. దీనం జేసి నావంశాంకురంబు పోయినది. నాభారతమహారత్నంబు పోయినది. నాసర్వంబునుం బోయినది. దుఃఖాయత్తచిత్తుండనైన నేనిపుడు జీవచ్ఛవంబనై యున్నవాఁడను. మాసుదర్శనుండు లోకాతీతమహిమాన్వితుండును, హలకులిశాది రేఖాసమంచితుండును, శ్రీవత్సాంకితుండును, సర్వలక్షణలక్షితుండును, ఏకసంథాగ్రాహియును, ఘనతరదయారూపుండును, దైవభక్తిపూరితుండును, బుద్ధిమంతుండును, సుందరవిగ్రహుండునునై యత్యంత ముద్దుగానుండినవాఁడు. ఆతండు నారచించిన శ్రీకృష్ణభారతాది మహాగ్రంథములలోని పెక్కుపద్యములు చదువుటయే కాక ప్రతిదినమును రామాయణాది గ్రంథములు చదివి యర్థము చెప్పుచుండును. వానికీబొబ్బిలియుద్ధనాటకములోని పద్యములన్నియు వచ్చును. ఆపద్యము లభినయపూర్వకముగా రసోచితముగాఁ జదివి జనులనానందింపఁజేయుశక్తి చిఱుతప్రాయముననే వానికలవడినది. నాయన్నిపుస్తకములలో నీపుస్తకము వానికిఁ బ్రీతి మెండుగావున వానియాత్మశాంతికై యీనాటకరాజము ముద్దులకుమారుని పేర నంకితము చేసి నాదుఃఖమించుక దీర్చుకొనందలంచితినని విన్నవించుచున్నాను.

శ్రీ. కృష్ణమూర్తి శాస్త్రి.

# అంకితము.

---

శ్లో॥ ఉక్త్వాజీవితనాటకస్య చరమా మోాంతత్స విత్త్యుత్తమా
ముక్తిం ముక్తి మితో గతోఽధికధియా దేహాంత్యజన్ భౌతికం
ఆత్మామే సుతరూపతః ప్రతికృతో దివ్యాం సదైతూన్నతం
నిత్యానందసుఖం సుదర్శనసుధీ విఖ్యాతనామాంచితః॥

సీ. ఎవ్వాఁడు శ్రీవత్స ♦ మేయనఁ దగుబాల్యము,
నచ్చతో జన్మించి ♦ మహిమఁ గాంచె
నెవ్వాఁడు తొమ్మిది ♦ యేండ్లు నాయింటిలో,
నల్లారు ముద్దుగా ♦ నైతలిర్చె
నెవ్వాఁడు బాలుఁడై ♦ యెనక మెసంగియు,
నెల్లవృత్తాంతము ♦ లెఱిఁగికొనియె
నెవ్వాఁడు చెప్పిన ♦ దెల్ల నొకానొక,
సంతసగ్రహింపించి ♦ చదువనేర్చె
గీ. అతఁడు వేదశాస్త్రప్రియుం ♦ డమలమూర్తి
దేవతాంశభవుండు సు ♦ ధీ విధేయుఁ
డార్యధర్మప్రియుండు మ ♦ దాత్మజన్ముఁ
డమరుఁ డగుఁగావుత సుదర్శ ♦ నాహ్వయుండు.

వ. అట్టిలోకోత్తర గుణోత్తరుండు నాకుఁ గుమారుండై పుట్టి స్వల్పకాలంబున సకలధర్మంబు లెఱింగి దైవప్రేరణంబునం జేసి పరమపదం బలంకరించియు నాయాత్మం బెడఁబాయకుండె. అట్టినావట్టి సుదర్శనసుధి కాత్మశాంతియు మనఃప్రియంబునగునట్లుగా వాని కీనాటకరాజం బాంకితంబుచేసి సఫలీకరింపఁబడియె.

శ్రీ. కృ. శాస్త్రి.

శ్రీ

# బొబ్బిలియుద్ధనాటకము.



## ప్రథమాంకము.

### నాంది.

శ్రీలన్ మేలిమిఁ గాంచి దుష్టులసమ ♦ ష్టిన్ స్వాభిమానంబు నో
శీలంబున్ విడి ద్రోహు లైనఖలులన్ ♦ శిక్షింప, రక్షింప భ
క్తాళిం, బొబ్బిలిరంగనాయకుఁడు మీ ♦ కౌదార్యమున్ శౌర్యమున్
శీలంబుల్ స్వజనాభిమానమును నా ♦ సిం గూర్చి రక్షించుతన్.

(నాంద్యంతమున.)

సూత్రధారుఁడు—అతిప్రసంగమేల ?

గీ. మాన మభిమానమును గల్గి ♦ మంచివృత్తి
నొరులప్రాపున కాశింప ♦ కుండ నెంచి
భరతవర్షంబునం బుట్టి ♦ భారతీయు
లైన దేశాభిమానుల ♦ కంజలి యిది.

[తెరవంకఁ జూచి.]

నటీ ! యేమి చేయుచుంటివి యికమా యిటురా ?

నటి—(పాడుచుఁ బ్రవేశించి) ఆర్యా ! నమస్కారము. దాసురాలి కేమి యాజ్ఞ ?

సూత్ర—ప్రేయసీ ! దేశాభిమానులును శౌర్యనిధు లగునీసభాస్తారు లెల్లరును "నేఁ డొక్క వీరరసప్రధానరూపకముం బ్రదర్శింపు" మని నాకాజ్ఞాపించినారు. తదనుగుణం బైనమహానాటకం బేదియో విచారింప వలయునని ని న్నిట్లు పిలిచితిని.

నటి—ఆర్యపుత్రా! సర్వజ్ఞులకుఁ దెలియని దేమున్నది? ఈయుద్ధ కాలా మీ కుపదేశించుచున్నది? దేవా! యీశరచ్చంద్రచంద్రికాప్రసారం బువలె సారతరంబైనమీహృదయకమలంబునం దించుకఁ జూచినంతు లేని సర్వమును మీకు కరతలామలకంబగు.

శా. తెల్లంబున్నవిలు తెల్లదివ్వె లగుచున్ ♦ రేలుం బవల్లుం గడున్
దెల్లంబై వెలుఁగన్ దిశావలయముల్ ♦ తేజంబునం గ్రాల ను
త్ఫుల్లాంభోరుహగర్భసౌరభము సం ♦ పూర్ణంబుగా భూతలం
బెల్లం గ్రమ్మఁగ నెల్లవారిమది కెం ♦ తేని స్వీకానం బిచ్చున్.

సూ—కాంతా! ఎంతచక్కఁగా జ్ఞప్తికిం దెచ్చితివి! ఏమియీ శరదృతుప్రభావము!

క. బెబ్బులులు రేఁగి మిక్కిలి,యుబ్బనజృంభించునట్టు ♦ లూహింపంగా
బొబ్బిలివారలయుద్ధం, బబ్బబ్బ! యనంగ వీరి ♦ కబ్బురమిడదే.

నటి—ఆర్యపుత్రా! ఆబొబ్బిలియుద్ధ మంతయు రూపకరూపంబునం గన్పట్టు చున్నదియా?

సూత్ర—లేక యేమి?

గీ. సృష్టికిం బ్రతిసృష్టిని ♦ జేసినట్టి
కౌశికు గోత్రమందు వేం ♦ కటమనీషి
కాత్మజుం డయి పుట్టిన ♦ యట్టివాఁడు
కృష్ణకవిరాజు దలఁప దఁ ♦ త్కృతికిఁ గర్త.

నటి—ఆహా! కవిరాజకృతియె గలిగినం గొదువయేమి?

సూత్ర—దేవీ!

ఉ. వీరరసప్రధాన మయి ♦ విశ్రుతి కెక్కినటకంబులం
బేరు వహించి రాద్రిమును ♦ బీరముఁ బెచ్చుపెరింగి యేరికిన్
భూరిభయానకం బనెడు ♦ బుద్ధిని బుట్టఁగఁ జేయునట్టిచో
నారసవంత మైనకృతి ♦ నాడి బహూకృతి నందు మీవిటన్.

నటి—ప్రాణేశ్వరా! నా కానాటకము పేరు విన్ననే భయమగుచున్నయది. మఱి యాబొబ్బిలియుద్ధరంగమున వేల నగునే నెట్లు ప్రవర్తింపఁ గలను?

సూత్రి—అది నిజముగా బొబ్బిలియుద్ధరంగమే యనుకొంటివా యేమి? బొబ్బిలియును లేదు. యుద్ధమును లేదు. వీరు లన్నపేరుగాని వారును లేరు. అది యంతయు నాటకాభినయము కాని భయము లేదు.

[తెరలో]

ఓరోరి! క్రూరా! అసత్యప్రలాపసంపాదితమహాపాతకవర్తీ! పాపాత్ముఁడా!

చ. ఎవఁడుర నీవు? బొబ్బిలిపు ♦ రీశ్వరము న్మఱి వారియుద్ధమున్
బ్రవిమలశౌర్యమున్ వితగఁ♦బల్కుచు లే వనుచుంటి వేమిరా?
భువి నరికంఠలుంఠన స ♦ ముద్భవతేజుఁడు తాండ్రపాపరా
ట్ప్రవరుఁడు ఖడ్గహస్తుఁడయి ♦ ప్రస్తుతి కెక్కనటం చెఱుఁగవా.

సూత్రి—(భయసంభ్రమములతో) అమ్మయ్యో! పులి పులి. బొబ్బిలిపులి వచ్చిపడుచున్నది పద పద ప్రాణములుదక్కించుకొందము

[అని నిష్క్రమించుచున్నారు.]

ఇది ప్రస్తావన.

---

[అంతఁ బైపద్యమునె చదువుచుఁ గత్తి దూసికొని తాండ్ర పాపారాయుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పాపా—(పరికించి) ఓరోరి! శైలూషాధమా! నీ వెందుఁబోయితివిరా? విజయరాము నట్టివీరాలాపంబు లాడునీనాటకాభినయంబంతయు నెంతభీభత్సమై భయానకంబుగాఁ బరిణమింపఁ బ్రవర్తిల్లఁ జేసెదనో చూడురా!

[అని కత్తింద్రిప్పుచున్నాఁడు.]

(తెరలో)

శా. వీరాలాపము లాడుచుంటివిర దే ♦ వీమధ్యమం దుండి గం
భీరారావ మెసంగఁ జాలు సిసీ! నీ ♦ వీరంబు ఘోరాహవ

క్రూరాస్త్రంబులు తాకుదెంచెను శతఘ్నిం ♦ గొంచెం బగుం జూడు మో
రోరీ! బొబ్బిలి బెబ్బులం జెలుఁగవో ♦ యున్మాదమో దుర్మతీ.

[అని చదువుచుఁ గత్తిదూసికొని వెంగళరాయఁడు ప్ర॥]

వెంగ—(పరికించి) బావా! ఏడీ? విజయరాముఁ డనుచుంటి వేడీ? నేఁడీ కరవాలఁబున కాతనిం బలి యిచ్చి జగంబునందీ బొబ్బిలి బెబ్బులియనం దోఁపఁ జేసి వాసి కెక్కెదంగాక. [కత్తిం ద్రిప్పుచున్నాఁడు]

పాప—(శాంతించి) వెంగళరాయా! నీయంతరంగం బెప్పుడును దుష్టశిక్షణమందే యుండును గావున విజయశబ్దము వినినంతనె నీ కా దుష్టాత్ముఁ డగు విజయరామరాజు స్మరణమునకు వచ్చినాఁడు. కాని యతఁడు గాఁడు సుమీ! ఎవఁడో శైలూషాధముండు.

వెంగ—పాపరాయాగ్రణీ! అది యట్టిదియా? కాని విజయ రామరాజు మనపై నంత ద్వేషించి యుండుట కేమి కారణము?

పాప—విజయనగర రాజులకును బొబ్బిలి రాజులకు నెప్పటికి నీయంతఃకలహంబు లున్నవియే. విశేషించి విజయరామరాజు క్రూరాత్ముఁ డగుటం జేసి మునుమున్న చరణాయుధద్యూతంబున మనచే నోటువడి నది మొదలు నేఁటివఱకును మన శౌర్యధైర్యాదులకుం జూపోపక మసమస మసలుచిత్తంబున నుత్తలంపడుచున్నవాఁడు. మన మతనిచేతి క్రిందివారమని తనలోఁ దాన గర్వించుచుండు. అతండు మొన్న మన వారు మనకొండలనుండి వారి కేదారంబులకుం బాఱుసెలయేళ్లకు గుత్తికిళ్లుకట్టి నీళ్లు మనతట్టు మళ్లించుటం జేసియే గాక నే నప్పద్మనాభంబునకుం బులివేఁట వచ్చినవారిం దూలించుటం బట్టి మఱింత మండిపడుచున్నవాఁడు. అతఁడెంతమండిపడి యేమిచేయఁగలఁడు!

వెంగ—బావా! అది యట్లగు వానిపట్ల మన ముపేక్షఁ జేయ వచ్చునా? ఉపేక్షించిన నతండు సమయముపరీక్షించి పైఁబడి పరాక్రమింపకుండునా? శత్రువలంతియని తలంచుట రాజనీతియా?

క. ఈమన్నాత్రుఁడెయైనన్ ద్వేషించినవానిఁ ద్రుంచు ♦ విధియగు; శత్రో
చ్ఛేషం న శేషయేత్తు స్సుభాషణము విభూషణమ్ము ♦ ప్రభువర్యులకున్.

ఇదిగాక నీకా విజయరామరాజులంతివలె నగపడుచుండఁజాలు విశ్రమము.

క. నవలక్షకళింగాఖ్యాత్యవనికి నధినాయకుండు ♦ సద్గాన్వితుఁడున్
యవనేశప్రియుఁడుం దచ్ఛ్రితవిమం డావిజయనగర ♦ రాజని వింటిన్.

పాపా—(పరిహాసించుచు) బావా! నీవింతపిఱికివాఁడ వని నేనన్నఁ జుసు దలంప నైతినిగదా! మనకు గర్భశత్రువైన విజయరామరాజు శౌర్యాదికము గుఱిచేసి బట్టువలెం బొగడుచుంటివి! పరాక్రమైకజీవనులగు మీతొంటివారినైనఁ దలంపవైతివిగదా! మీకేగాక వెలమకులంబున కంతకును నపకీర్తి దెచ్చు ముచ్చట లుచ్చరించుచుంటివక్కటా! కాలమహిమ! పులిపిల్ల పిల్లికిం జనిసి పాలు నట్లయ్యెఁగా!

వెంగ—(భీకరంబుగా నొక్కమాటు హుంకరించి) ఆఁ! ఏమి యిట్లంటివి? వెలమబిడ్డనైన నన్నే పిఱికి గాఁ దలంచుచుంటివా! నేనా నావారి కపఖ్యాతిం దెచ్చువాఁడను! నీశౌర్యం బేపాటిదియో పరీక్షింపఁ గోరి శత్రుపుకొలందియిట్లున్న దంటినిగాని బట్టునై భయంపడి పొగడఁ జొచ్చితి ననుకొంటివా?

క. చిచ్చుఱికి చొకళింతున్, జచ్చుటవిపుగులను నైనఁ ♦ జేపట్టి వెసన్
విచ్చలవిడిఁ జెరలాడెద, వచ్చెద జముఁబంట్లఁబట్టి ♦ వంగసమెన్నన్.

(అని యూరుఁ గఱచి రోజుచున్నాఁడు)

పాపా—బావా! నీకెంతపూనిక యున్నదో నే నెఱుంగఁ గోరి యిట్లంటినిగాని నీధైర్యస్థైర్యశౌర్యగాంభీర్యాదులు నే నెఱుంగనవియా? లోకం బెఱుంగనవియా?

ఉ. కోటిశతఘ్నులొక్కపరి ♦ గూడి గుభాల్ గుభనిస్వనంబుతో
మేటిగఁ బ్రేలుచున్నతఱి ♦ మించినశత్రుబలార్ణవంబునన్
బోటరియై చొరంబడి య ♦ భూతపరాక్రమవిక్రమంబునన్

దీటడఁగింపవే పగఱ ♦ నీరణపద్ధతు లే నెఱుంగనే.

నామాటలకు నీవన్యథాభావంబు భావంబునం దగులనీకుము. దీనిని బఱియాచకంబుగాఁ బరిగణించి యైన శాంతించి నన్నుఁ దయఁ జూడుము. (అని చేతులు పట్టుకొనుచున్నాఁడు.)

వెంగ—(శాంతించి) వెలమకులంబున కపకీర్తియగు నీ మాట నన్నొకింత బాధించె, మహాబలపరాక్రమవంతుఁడ వైన నీవు నన్నుఁ బురికొల్పుట కని యందువుగాని మఱియొకటి గాదు. దాని కేమది యట్లుండనిమ్ము. విజయరామరాజు ప్రవర్తనంబిపు డతికాపట్యంబునఁ బొలుదోఁచుచున్న దేమి?

పాపా—అతఁ డెప్పటికిం గపటియే కాని నీ విప్పు డిట్లనుటకుం గారణ మేమి?

వెంగ—విజయరామరాజిపు డన్నగారియొద్ద కొక రాయబారిం బుచ్చినాఁడు.

పాపా—హా! హా! మన మహారాజు రాయబారిమాయలోఁ బడ లేదు కదా?

వెంగ—వానిమాయలోఁ బడుట కన్నగారికంటెఁ బడక మున్నె వాఁడు నాచేతిలోఁ బడినాఁడు.

పాపా—ఏమి వృత్తాంతము?

వెంగ—ఆరాయబారి చేత నొకజాబుఁ గొని మహారాజదర్శనంబునకై హజారముకడ వేచియుండెను. అంతలో నెట కేనిఁబోవు నేనటఁ దారసించి తదుదంతం బంతయు నాకర్ణించి వానియొద్దనుండి పత్రికం గొని బహూకరించి సాగనంపితిని.

పాపా—ఏమిచ్చి బహూకరించితివి?

వెంగ—రెండుచపేటంబులును నొకయర్ధచంద్రప్రయోగంబును.

పాపా—వాని నంత కేయుఁడ నవసర మేలవచ్చెను? పత్రికావిశేషం బేమి.

## ప్రథమాంకము.

వెంగ—రామరాజుపై నాగ్రహమే కారణము. మఱి పత్రికా విశేషంబు వినుము. గోలకొండసర్కారునుండి బుస్సీ సపరివారుండై హైదరుజంగుతో జమాబందికి వచ్చి రాజమహేంద్రవరముకడ విడిసి యుండుట మనము నెఱింగియున్నదేకద ?

పాపా—సరే ! విజయరాముఁ డమన దేమి ?

వెంగ—"కతిపయసేనాసమేతంబుగా బుస్సీ ప్రభృతులు వచ్చి యున్నారు వెచ్చకన్నుఁ గట్టవలసిన మనమిపుడు పూర్వవైరము లుగ్గడించుకొనక చతురంగబలంబులం గూడిపోయి వన్నిపుడుకట్టలే మని చెప్పుదము, దానికి వారొప్పకున్నఁ జేయవలసినపని చేసివత్తము" అని.

పాపా—

శా. ఔరా ! యెంతటితంత్రవాదియొ కళిం ♦ గాధీశ్వరుం డెన్నికో
ట్లోరూప్యంబులుపన్నుఁగట్టఁ దగి యె ♦ న్నో యేండ్లుతానుండి వా
రేరా పైకము రాదటం చడుగ రా ♦ నీలేక యెట్లాడియో
భారంబుల్ మన నెత్తి వేయుటకుఁ గాఁ ♦ బన్నెంజుమీ యుగ్రతన్.

ఇంతియెకాని మనపము దయచేత వర్తమాన మంప లేదు. మనము వానిమాట విని మోసపోయి వానివెంటనంటిపోయిన నెటు పోయి యెటువచ్చునో! ఎంతమోసము! యెంతమోసము! పగతు రెంత కయినం జాలియుందురుకదా !

గీ. తన్నుఁ బ్రక్కలోన ♦ నున్నబల్లెం బని
తలఁచుదాయ వచ్చి ♦ తలను మొట్టి
బాన చేసె నేని ♦ దోసిలి యిడె నేని
విశ్వసింపరాదు ♦ విజ్ఞుఁ డెపుడు.

(తెరలో) హా ! కరుణాతరంగితాంతరంగా ! హా ! బొబ్బిలిపురాధీశ్వరా ! హా ! రంగారాయమహారాజ ! నిర పరాధిని నన్ను రక్షింపుము. రక్షింపుము. (అని రోదనము.)

చ. అభయ మొసంగినాఁడ భయ ♦ మందకుమింకిట నార్తలోకమా!
త్రిభువనకంటకాహవ ♦ నిష్ఠురప్రాణుఁడ రంగరాయభూ
విభుఁడను వచ్చుచుంటి నొక ♦ వ్రేల్మిడి నీవెతలెల్లఁ దీర్చి నిన్
విభవసమేతుఁ జేసెదను ♦ నిక్కము నిక్కము విశ్వసింపుమా.

పాపా— యువరాజా! మనమహారాజు నీచే వ్రేఁటుపడినరాయబారికభయప్రదాన మొసంగి భయంకరప్రకారంబున నిట వచ్చుచున్నవాఁడు మన మిప్పు డిట నున్న నేమి వచ్చునో పోవుదము రమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.



[స్థలము బొబ్బిలిలో సభాభవనము.]

[అంతఁ బైపద్యమును జదువుచు రంగరాయఁడును కాళ్ళమీఁదఁ
బడి దుఃఖించు రాయబారియును ప్రవేశించుచున్నారు.]

రంగా— (లేవఁ దీయుచు)

శా. ఓయీ! యింతదురంత చింత యిటులే ♦ లో నీకు సంప్రాప్తమై
వాయెం డందురపిల్లఁ జేసెనిని? నీ ♦ వాసప్రదేశం బదే
దో యెం దేగుచు నిందు వచ్చితివొ యే ♦ రో నీవు నీవృత్తమె
ల్లో యాథార్థ్యమెఱుంగఁ జేయుము తెలం ♦ గున్నట్లుగావించెదన్.

రాయ— (లేచి) మహారాజ, నేను విజయరామరాజపురందరుని సందేశంబున రాయబారినై విజయనగరంబునుండి దేవరదర్శనార్థ మిట వచ్చినాఁడ.

రంగా— (చిఱునగవుతోఁ దనలో) ఓహో! యిది పరమాశ్చర్యము. కానీ విచారించెదంగాక. (ప్రకాశముగా) సరే! తరువాత ?

రాయ— తరువాత నేమి చెప్పుదు నో మహారాజా! నేను దేవరదర్శనార్థము హజారముకడఁ బ్రతీక్షించుచుండ నటకు వేంగళరాయనృపాలుం డరుగుదెంచె,

రంగా—(తనలో) దుందుడుకువాఁ డతఁ డితనిం బ్రహరించెఁ గాఁబోలు (ప్రకాశముగా) తరువాత ?

రాయ—అతండు నావృత్తాంతం బంతయు విని నన్నుఁ జెంపలు వాయఁ గొట్టినాఁడు మహారాజా! రక్షింపుము. రక్షింపుము.

రంగా—(తలవంకించి) ఆఁ! వెంగళరావే యిట్లు చేసినాఁడా? కానీ విచారించెదంగాక, చింతింపకుము. ఓరీ యెవఁడురా! అక్కడ ?

సేవకుండు—(ప్రవేశించి) మహాప్రసాదము మహారాజ! దాసున కేమియాజ్ఞ?

రంగా—నీవుపోయి నరసారాయ వేంగళరాయులం దీసికొని రా ?

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

రంగా—రాయభారీ! విజయరామరాజుగారికి మాపైనింత యనుగ్రహము కలుగుట కేమి కారణము ?

రాయ—రాజా! మారాజేంద్రచంద్రుఁడు మీయనుగ్రహపాత్రుండు గాని ప్రాతపగలం బురస్కరించుకొని కట్టినపట్టు నేవిధి వదలినవాఁడు గాఁడు.

రంగా—సరే! యిప్పుడేమి కారణంబునం జేసి నిన్నిటకుఁ బుత్తెంచెను?

రాయ—సర్వమును విశదంబుగ నొకజాబు వ్రాసి యేలినవారి కిమ్మని నాచేతి కిచ్చినాఁడు.

రంగా—అదేది ?

రాయ—వెంగళరావు దానిం దీసికొనియె.

రంగా—ఒకరివస్తువు నింకొకరి కిచ్చుట దూతకృత్యమునకు దూష్యము గాదా ?

రాయ—చిత్తము రాజాధిరాజా! తానే మహారాజ నని చెప్పి యతండు నాచేతనుండి జాబులాగుకొని నన్నడచినాఁ డీతప్పు క్షమింపుము దేవా !

(తనలో) ఓహోరి! యసత్యవాదీ! సత్యమహాపాతకవర్తీ! సత్యసంధుం డయిన మహారాజుకడ నిట్లసత్యముగఁ బ్రేలుచుంటివేమిరా?

ఉ. దష్టుఁడ వీవు దుష్టునకుఁ ♦ దోడ్పడి వచ్చితి రాయబారివై
శిష్టజనప్రశస్తమయి ♦ చెన్నలరారెడు రావువారికు
త్కృష్టసభాస్థలంబునఁ బ్ర ♦ తిష్ఠితుఁ జేయుట దోష మౌ నిన్నుఁ
గష్టుఁడ పెద్ద చేసి తున ♦ కంబును బల్లకి నిల్పు టొప్పునే.

(అంతఁ బై పద్యమును జదువుచుఁ గత్తి దూసికొని వెంగళరాయఁడును, అనుసరించి శాంతిం జూపునరసారాయడును ప్రవేశించుచున్నారు)

నర—కుమారా! శాంతింపుము. నీచేయి మిగిలినప్పుడు మీఁదు మిక్కిలి నీ కిట్లు క్రోధవచనంబు లుచ్చరించుట తగదు. ఎంత క్రోధమున్న నంత శాంతం బూనుటయే మమ బోంట్లకు విభూషణంబు. మీయన్న రంగారాయఁడు నీచేత క్షాగ్రహించియే నిన్నిట్లు పిలువం బంచె. అతం డదె సింహాసనాసీనుండై యున్నవాఁడు. నీమాటవిన్న నతనిచిత్తం బన్యథాభూతంబగుఁ గావున శాంతించి మహారాజు నను సంధింపుము. వినయం బుసం బ్రార్థింపుము.

ఉ. పిన్నవు నీవు నింటి కగు ♦ పెద్ద పితృప్రతిమానుఁ డన్న శౌ
ర్యోన్నతకీర్తి, శిష్టుఁడు ప్ర ♦ భూత్తరుఁ డుత్తముఁ డాతఁ డట్టిమీ
యన్నమనంబు నట్టి మన ♦ మందిఱుమం జన నొప్పుఁ గాని యీ
చిన్నతనంపుదుందుడుకు ♦ చేష్టల నిష్టము రొప్ప నొప్పునే?

వెంగ—పెద్దలు మీరు మీ చెప్పిన చొప్పునం బ్రవర్తించెదంగాక.

(అని సమీపించుచున్నాఁడు)

నర—(సమీపించి) జయము జయము మహారాజ!

రంగా—మంత్రివర్యా! రమ్ము పీఠం బధిష్ఠింపుము.

నర—(ఉపవిష్టుఁ డగుచున్నాఁడు.)

వెంగ—(రాజుపాదములకడ సాఁగిలఁబడి నమస్కరించుచున్నాఁడు)

రంగా—వెంగళరాయా! నన్నింత పెద్దఁ జేయుచుంటి వేమి? నీవె మహారాజవు కావున రమ్ము సింహాసనం బెక్కుము.

వెంగ—(భయ మభినయించుచు) మహారాజ! ఏమి యిట్లను చుంటిరి? నాకడం గలిగిన మహాపచారం బేమి?

క. అన్నవు పితృసముఁడవు ప్రమతి, నన్నుం బ్రేమించి పెంచు మ ♦ నరనాథుఁడవర్లా
విన్నది కన్నదిగా విటు,లన్నా! తప్పున్న సైపు ♦ మా దయతోడన్.

రంగా—వినయధురీణా! ఈవినయంబుల కేమికాని వీనితో నే మంటివి నే నే మహారాజ ననియా?

వెంగ—(క్రోధముతో లేచి రాయబారి దిక్కు మొగంబై) ఓరోరి! యసత్యవాదీ! సత్యసంధుం డయినమహారాజుకడ నిట్లసత్యముగాఁ బ్రేలితి వేమిరా? (దుష్టుఁడవీవను నొకటిపద్యము చదువుచు కత్తి దూసికొని పైకురుకుచున్నాఁడు)

నర—హాఁ! హాఁ! శాంతింపుము శాంతింపుము. (అని యడ్డుపడుచున్నాఁడు.)

రంగా—వత్సా! శాంతింపుము. ఈమాట కేమిగాని వీనికడనున్న నాజాబు నీ వేల లాగికొని చదివితివి? వీని నేల నడచితివి?

వెంగ—(చేతులు జోడించుకొని వినయంబుతో)

మ. అది నాతప్పు క్షమింపు మోనరవరే ♦ ణ్యా! వీఁడు కాళింగరా
ట్పదమందుండెడు రాయబారి యని చే ♦ ష్టల్ వాయియెత్తంగ నా
హృదయంబుం దలరామభూధవునిపై ♦ రేకెత్తియున్నట్టిక్రో
ధదశన్ గ్రిందుమీఁదుఁ గానక యస ♦ త్కార్యంబుగావించితిన్.

రంగా—గీ. రాజుపైఁ గలకోపంబు ♦ రాయబారి
మీఁదఁ జూపుట యుచితమే ♦ భూదయితుల
కితఁడు చేసినతప్పేమి? ♦ యితని నడవ
నేటి? కవివేక మది యని ♦ డేటపడదె?

వెంగ—(తల వాంచి భయ మభినయించుచున్నాఁడు)

రంగా—వత్సా! కడచినదానికిఁ గళవళంపడకుము. విజయరామరాజేమివ్రాసెనో చూచి మాకా విటు తెమ్ము.

వెంగ—(భయసంభ్రమంబు లభినయించుచున్నాఁడు.)

నర—మన వెంగళరాయఁ డారాజుమీఁది కోపంబునం దానిఁదునాతునియలు గావించెనఁట. మహారాజా! తప్పైనది కాచి రక్షింపుము.

రం—అయ్యయ్యో! యెంతప్రమాదము సంభవించినది? కానీ దాని నితండు చదివియుండును గావున నందలివిశేషము లేమియో?

నర—"గోలుకొండనుండి బుస్సీ సపరివారుఁడై హైదరుజంగుతో జమాబందీకొచ్చి రాజమహేంద్రవరమునం దున్నవాఁడు. కావున మనము మన పూర్వవైరమును మాని చతురంగబలసమేతులమై పోయి పన్నుఁ గట్టలేమని చెప్పకము దానికి వా రొప్పకున్నఁ జేయవలసినపని చేసి వత్తము" అని.

రంగా—(తనలో) అన్నరా! ఎంత తంత్రవాదియో విజయరామరాజు! (ప్రకాశముగా) మంత్రివర్యా! వీనికిఁ దగినట్లు చెప్పి యంపి పుచ్చుము.

నర—(దూతదిక్కు మొగంబై, ఓయీ! మా వెంగళరాయం డప్ప చాటువాఁడు; వాని చేఁతలకు నీవు చింతింపకుము. మీ రాజుతో,

శా. మాపై నింతకృపారసం బొదవఁగన్ ♦ మాకెంతొ సంతోషమై
మీపట్లన్ గురుభావ మెంచితి మెదన్ ♦ మీ చెప్పిన ట్లీయు మీ
ప్రాపై పోనటకే తలం పయిన మా ♦ రాజానుజోద్వాహ మీ
మా పేగావున మిమ్ముఁ గూడమికి లో ♦ మన్నింప నో మాపఁడున్.

(అని మామాటగాఁ జెప్పుము.)

వెంగ—(దూతఁ జూచి)

క. ప్రహరింపఁబడితివారం, సహాయశూరులు త్వదీయ ♦ సాహాయ్యంబున్
గ్రహియించువారు గారది, సాహసపరాక్రమములు నన్నఁ ♦ గణియింపరె దన్

(అని నీమాటగాఁ జెప్పుము.)

ఉ. తమ్మునిఁ జంక్షి వైభవవి ♦ ధానము సల్పఁగ పోవరాదు, దే
శమ్మున కాధ్యుఁడైనబుసి ♦ శాసనముం గడిదాటరాదు, ము
ఖ్యమ్ములు రెండుకార్యములు ♦ నారయ నొక్కతటిం దటస్థమై
నెమ్మది నూఁపుమండెడిని ♦ నిల్వఁగ నెద్దియుఁగా దిదెట్లకో.

ఏది యెట్లయినను నేను బుస్సీదర్శనంబునకుఁ బోవుటయే శ్రేయమని తోఁచుచున్నయది.

నర — రాజా! నాకట్లుతోఁప దేమంటివే వినుము. విజయరామ రాజున కాహైదరు చాలముఖ్యుఁడై యున్నాఁడని తెలియవచ్చు చున్నది. విశేషించి యిపుడు మనవిరోధి తనమాట నుల్లంఘించి తన దూతం బరాభవించితి మని దండంబున నతం డంతయేని మంచిపడు చుండుచు. అతం డతనికి లంచమిచ్చియైన బుస్సికి బోధించి మన కవమానంబు చేయించుట సిద్ధము.

రంగ — (కోపముతోఁ గత్తి జళిపించుచు)

మ. అవమానం బొకఁడౌనె రావుకులదు ♦ గ్గాబ్ధిముఁ డౌతేనికిఁ
యవనుండుఁ గినుండు వానితలపై ♦ నావాఁడు నక్క కెక్కయే
భువనంబుల్ భువనాధినాధుఁడును నం ♦ పూర్ణసిత్తిం గూడి రా
నవలీలం ద్రసరేణురూపములు గా ♦ నాలంబునఁ రాయఁడే.

బుస్సిభయంబును గిస్సిభయంబును మానంగడంబున లేనిమాటయే నిక్కంబు. కాని కార్యాంతరవ్యగ్రత మనమహారాజుం గలఁగించు చున్నయది. నాకిపు డీకళ్యాణంబైన నేమి కాకున్న నేమి? ఇతఁడటఁ బోవున్న వారు మనపై దాడి వెడలుదురు. అదియే నాకుఁ గళ్యాణంబు (కత్తి సవరించుచుఁ బరికించి) అదిగో నెవ్వఁడో చారుఁడు తత్తఱపాటుతో వచ్చుచున్నాఁడు. వారుపోరునకు వచ్చునట్లే నామదికిం బొడకట్టుచున్నది.

(అంతట చూచుచున్నారు. అంత నొకచారుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

చారు— జయము జయము. మహారాజ! (వంగినమస్కరించు చున్నాఁడు)

నర—ఎవఁడురా నీవు? ఏమివృత్తాంతము?

చారు—అయ్యా! నే నేలినవారి దాసుఁడను. దేవరవారిలో మనవిచేసికో వచ్చినాను.

నర—చెప్పుము. విజయరామరాజు మనపై దండెత్తి వచ్చు చున్నాఁడా యేమి?

చారు—వానిమొగము! మనపై వాఁ డెక్కడ దండెత్తఁగలఁడు సామీ? కానీ పరాసులబూసి హైదరుసాహేబుతో ననకాపల్లికివచ్చి నాఁడంట. ఇతఁ డాఁడకుఁ బోయి సరకారుతాకీదు మనము గురిసేసి నాము కామని మనపై నేరాలు సెప్పి హైదరుసాహేబుకుఁ బన్నెండు లచ్చలు లంచ మిచ్చి వానిచే బూసికిఁ బోరు మట్టు సేసి మనబొబ్బిలి గడీని ముట్టడింప వచ్చుచున్నాఁడంట బాబూ!.

వెంగ—సరే! సంతోషము. నీవుపోయి మనబలగంబుల కెల్ల నిది తెల్పి పురికోల్పుచుండుము. పొమ్ము.

చారు— (నిష్క్రమించుచున్నాఁడు.)

రంగా—మామా! యేమి యాలోచనము?

నర—రాజా! అధైర్యపడకుము.

రంగా—(ఔడు గఱచి మీసము మెలివెట్టుచు) మంత్రిపుంగవా!

శా. ధైర్యస్థైర్యహిమాద్రులు లీవెలమ స ♦ ద్వంశప్రభూతప్రభుల్

శౌర్యౌదార్యగరిష్ఠు లందుఁ బ్రబలుల్ ♦ మారావువా రట్టినే

వీర్యం బేగ నధైర్యమొం బఱుచునే ♦ వీంద్రా త్రిలోకంబు తా

దార్క్ష్యోగ్రప్రథ నెత్తివచ్చినను దో ♦ ర్దర్పస్థితిం జూపనే.

అది యట్లుండెనను మునుముందు మనమే దండోపాయము బూనుటం గ దంగుట రాజనీతిపథంబు గాదు. కావున సామదానాదుల మన మా ఘరాసు సేనిం బరమాప్తునిగాఁ జేసికొనుటయే పాడి.

నర — రాజాగ్రణీ! నీమాట యుక్తియుక్తముగా నున్నది. కాని శత్రురాజ పరిశోధితుం డగుబుస్సీ మనసామంబిస్సీయుటన నటుం గావున మనకుఁ బరమమిత్రుండును సకలపరాసు సేనాధ్యక్షుండును నగుగోరుం దొర కీవృత్తాంత మెఱిఁగించి తన్మార్గమున వీని ప్రాపొందుట మంచిదని నాయభిప్రాయము

రంగా — ఆహా! మిక్కిలి చక్కఁగా జ్ఞప్తికిం దెచ్చితివి. ఆగోరుం దొర మున్నె నుదకును నిజామునగరమువారికిం గలవివాదము దీర్చి మనపైఁ దయఁ జూపినవాఁడు. ఇట్టిదో మన కీయుపకారము సేయక మానఁడు కావున బృందావనపురంబున కిపు డొక్క రాయబారిం బుచ్చుము.

నర — చిత్తము. ఎవఁడురా! అక్కడ?

ద్వారపాలకుఁడు — (ప్రవేశించి) జయము. జయము. మహారాజ! యెవరో యిరువురు తురకహరకాలాలు వచ్చియున్నారు.

నర — వారిం బ్రవేశపెట్టుము. ఈజాబుఁ గొనిపోయి మంతెన బుచ్చన కిమ్ము. (జాబు వ్రాసి యిచ్చుచున్నాఁడు)

ద్వా — చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

హరకాలాలు — (ప్రవేశించి) మహారాజాకీ సలాం. వజీర్ సాహేబుకీ సలాం.

నర — మీ రెవరు? ఎక్కడనుండి వచ్చుచున్నారు? ఏమిపని నిమిత్త మిట వచ్చినారు?

హర — రాజాసాహేబ్! మేం బూసిసాహబు హుజూర్ సేఖర్లంమీరాయా అన్నాపల్లీసే మహారాజుకు సర్కార్కా హుకుం తెచ్చినాం సాహేబ్ (అని ఫరవానాపత్రిక నిచ్చుచున్నారు.)

నర — (పత్రికం గ్రహించి) మేము మీకు విశేష బహుమానము చేసెదము. మాకీమాత్ర ముపకారము చేయఁగలరా?

హార—మే మేఁ సేయవాలా బోలో మహారాజ్ !

నర—మఱి యేమియుంగాదు. కొన్నిమాటలడిగెదము. వానికి నిజమైన యుత్తరములు చెప్పుఁడు.

హార—సిత్తం. సిత్తం. హాజర్.

నర—విజయరామరా జిపు డెక్కడ నున్నాఁడో ? ఏమి చేయుచున్నాఁడో ? చెప్పఁగలరా ?

హార—సిత్తం. సిత్తం. విజయరాజా! హామారాలష్కర్మే బుస్సీకు మిలాఖత్ హైదరుజంగుసే బహూత్ మిలాఖత్ వున్నాఁడు ఖాన్. వాఁడికీ వాఁడు బారాలచ్చా బారీలంచా మిచ్చీనాడ్ మియా !

నర—మావిషయమై వా రేమనుకొందురో చెప్పఁగలరా ?

హార—క్యాఫాయిదా హుజూర్ ! హామారా హైదరుజంగ్ బద్మాష్ వున్నాఁడు. మహారాజ్ ! మీకీ మార్నేకు వస్తాడు ఖాయ్ !

నర—సరే మాయదృష్టమెట్లో యట్లు జరుగును మీరు పొండు.
(అని బహుమతులిచ్చుచున్నాఁడు.)

హార—(సలాములు చేసి నిష్క్రమించుచున్నారు.)

రంగా—మంత్రివర్యా ! మనప్రయత్నము లన్నియు నిట్లుగాఁ బరిణమించుచున్నవి. వివాహోత్సవంబున కంతరాయంబుగా రాజాధముం డెంతతంత్రంబు వన్నినాఁడో ? మన రాయబారి పోయినను వానినివారు సరకుగొనువారు కారు. ఇప్పటి సందర్భములం బట్టి చూచిన యుద్ధమగు ననియే తోఁచుచున్నది.

వెంక—(తనలో) ఇది నాకుఁ బెండ్లిచావెనే యున్నది.

రంగా—మూర్ఖజనబోధితు లగునామూర్ఖులు మనమేమిచెప్పినను బెడచెవిం బెట్టుదురు. అనేకశతసహస్రకాభిరక్షితశత్రుమహాసైన్యంబుతోఁ గతిపయసేనాపరివృతులము మన మెట్లోఁ పగలమో తోఁపకున్నయది. ఎది యెట్లు కాఁ దలఁచుకొనెనో దానికి దైవంబే ప్రమాణంబు. (ఆలోచించి) మనపాపారాయఁ డెక్కడ ?

పాపారాయఁడు—(తెరలో హుంకరించి)

మ. కరవాలంబున నట్టలం దలలు వే ♦ ర్గా లేచి తారత్ బలెన్
సురవర్త్మంబున నాడి శేషఫలముల్ ♦ జోకం బకుంజోప్వునం
ధరమీఁదం బడి బంతులట్లు కడిమిన్ ♦ దాటంగఁ బాటంబుగా
నరిసేనం దరలింతు రంతు నను డా ♦ యం జాలునా రుండినన్.

(అసికత్తి దూసికొని ప్రవేశించి పరవళ్లఁ ద్రొక్కుచున్నాఁడు.)

రంగా—బావా! నీ వెంతటైన సాహసుఁడవే కాని యిది యరిసేన గాదు. కన్ను దెఱచి వచ్చి నీవారిం దేరిపారఁ జూడుము. క్రోధం బుపసంహరించి యిందు విశ్రమింపుము. (పీఠముం జూపుచున్నాఁడు)

పాపా—(శాంతించి) జయము జయము మహారాజా! వైరుల సంహరింతు నను మన వేగఁ బ్రాయనిమాట విని నిజముగా వైరులే యని భ్రమపడి క్రోధతామ్రాక్షుండనై వచ్చితిని. రాజాధిరాజ! నా ప్రమాదంబునకుఁ బ్రభువు లాగ్రహింపకుందురుగాక (కూరుచుండును)

రంగా—బావా! శత్రువాక్యంబు వినినంతనే నీ కింత క్రోధంబు వచ్చి యిట్లయితివి. మఱి శత్రుదర్శనంబైన నెట్లగుదువో కదా!

రంగ—గీ. శత్రువాక్శ్రవణ మైన ని ♦ మ్మోటిపగఁడు
జంక డొంక నెఱుంగఁ డా ♦ శత్రుదర్శ
నం బదేపాటి తలఁపఁ ద్ర ♦ ణంబుగా మ
నంబునం దెంచి పొంగుఁ బ ♦ బ్బంబటంచు.

రంగా—పాపరాయా! నీ నాపనెలలకుం బాపరాయండ వనుట కింతయును సందియంబు లేదు. నీ ప్రాపునం జేసి మా కెన్నటికి నప జయంబు రానేరదు. కాని విజయరామమూర్తి—(అర్ధోక్తియందు)

పాపా—(ఆగ్రహముతో) హాఁ! మహాపాతకివర్తి విజయరామ మూర్తిం బెద్దచేసి కీర్తించెద వేమి? (సంభ్రమంబున లేచి) వాని నిప్పుడే చంద్రహాసంబునకు బలి యిచ్చి వత్తు నాజ్ఞ యిమ్ము.

రంగా——పురుషసింహా! శాంతింపుము. నామాట సాంతముగా వినుము. విజయరామనరేంద్రుండు సపరివారుండై రాజమహేంద్రవరంబు కడ హైదరుజంగుతో నెదురుకోలు సేసి యిచ్చకంబులాడి వానికిఁ బాడెరెండులక్షల రూప్యములు లంచమిచ్చి తత్సాహాయ్యంబున బుస్సీయనుగ్రహంబు వడసి వానికడ మన లేనితప్పులెల్లం జెప్పి యొప్పించి వారిద్దఱితోఁగూడ మనమీఁద దాడివచ్చుచున్నాఁడని వార్త వచ్చినది. అనేకశతశతఘ్నికాభిరక్షితం బగునప్పరాసుసైన్యంబుతోఁ గతిపయసేనాసహాయుల మగుమన మెట్లోపఁగలమో! కార్యంబేదియోఁ వచింపుము

పాపా——(అలక్ష్యం బభినయించుచు) మహారాజా! వారెన్ని వేలున్నను నీకాల్బలంబులో నొక్కనికినిం జాలిరారుసుమీ! ఇదినిక్కంబు.

ఉ. బుస్సియు హైదరు న్విజయ ♦ భూపతి వచ్చిన నేమి లెక్క వా
రిస్సిరో! కాలకాలుఁడు మ ♦ హేశ్వరుఁ డాత్రిపురారి వచ్చినన్
గస్సని లేచుత్రాఁచు వలె ♦ నాకరవాలము నాట్య మాడదే
దుస్సహమే రణంబు వగ ♦ దోగకు మింకిట రాజచంద్రమా.

నర——రాజా! మనపాపారాయఁడెంతపైనం జేయఁగలవాఁడిందుల కింతయును గొఱంతలే దిది యంతయుఁ నిక్కంబు. సంగ్రామంబు సంభవించునని మనకింతయుఁ జింతింపవలసినపనిలేదు. అయినను మనము జాగరూకులమై యుండవలసినవారము. కావున నాప్రముక్కడుల మన పాలంబు ద్రొక్కనీకుండఁ జేయుటయే మొదటఁ జేయవలసిన పనియై యున్నది.

రంగా——మామా! నీచెప్పినది యుక్తియుక్తముగా నున్నది. దానికి మనలో నెవ్వరుసమర్థులో? (పాపారాయనిదిలకించుచున్నాఁడు)

పాపా——రాజా! దీని కింత యేల? నేను సర్వమునకును సంసిద్ధుఁడనై యున్నవాఁడనే. కతిపయసేనాసహితుండనై యిపుడ పోయి వైరులు

వచ్చుమార్గంబున మనయెల్లరాజాముకడంగాచికొని యుండి వారినడ్డగించెదను. ఒండొకొండైన భండనంబు గావించి చించి చెండాడెద నాజ్ఞయొసంగుము. పోయివచ్చెద. (అని లేచుచున్నాడు)

రంగా—అనహాయశూరుఁడవు నీకుం జెప్పవలసిన దేమియు లేదు గాని పోరం దారతమ్యంబు లెఱింగి మెలంగుము పోయిరమ్ము.

పాపా—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

రంగా—అమాత్యశేఖరా! మనపాపారాయండు పోయిన శత్రువుల మన పొలంబునం దడుగు పెట్టనీయం డనియే నా నిశ్చయము. కావున మన మెల్లి పెండ్లికిం బ్రయత్నములు జేసికొందమా?

నర—వివాహోత్సవము నిరాటంకముగాఁ జేసికొనుట కేమియును సందేహము లేదు. అయినను మన మేమఱియుండరాదు. ఒకకన్నుమాత్రము మటు వేసియే యుండవలెను. విజయరామరాజనేక కుమార్గంబు లెఱింగినవాఁడు. ఏదారి నెట్లు సేనలం దెచ్చి యెట్లు చేయునో? మన మెంత యిక్కట్టుపడవలసి వచ్చునో?

రంగా—అదినిజమే. అతఁ డెంతకైనం జాలినవాఁడు. మనము జాగరూకులమైయుండియే ప్రవర్తింతము. మంత్రివర్యా! నీవు వైవాహికసంభారంబు లెల్ల సమకట్టింపుము. వెంగళరాయా! నీవు నాతో రమ్ము మనము స్వయముగాఁ బోయి సేనలం బురికొల్పివత్తము.

అందఱు—(లేచి నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

---

శ్రీ

# బొబ్బిలియుద్ధనాటకము.

ద్వితీయాంకము.

---

స్థలము, దేవులపల్లి చెంత డేరా.

(అంత హుకాం త్రాగుచు నాసీనుండగు హైదరుజంగును, పిన్నమంత్రై విజయరామరాజును ప్రవేశించుచున్నారు.)

హైద — క్యాభాయ్! నీకీ యింతా ఫికర్?

విజ — సర్కారువారితో నాభయము మే మని చెప్పుకొందును —

మ. వెలమల్ కొల్పులు తెప్పవచ్చి పడి నా ♦ పీచంబు వోఁగట్టి బా
ముఁ పా ల్సేయుదురో యటంచు నసిశం ♦ బుల్ దల్లడంబంద గుం
డెలు ప్రాణా లఱచేతఁ బట్టుకొని యే ♦ డీల్పడ్డ చిత్తంబుతోఁ
బాలుపేదన్ నిలనైతిఁ గాని సుఖము ♦ ష్పుల్ లేక పోయెంగదా.

బొబ్బిలివారిలోఁ బాపారాయఁడును వేంగళరాయఁడు నతిక్రూరులు. వారు నన్నను నారాజధానిని దృణప్రాయముగాఁ జూచు చుందురు. రంగారాయఁడును వా రాడినదాట పాడినది పాటగాఁ జూచుచుండును గాని మాటాడువాఁడు కాఁడు. ఇప్పటికైన వారి యభిప్రాయము లెట్లున్నవో చూత మని వెన్న నేనొకదూతం బుచ్చితి. వాఁడు వారికడకుం బోయి "బుస్సీయును హైదరుజంగుసాహేబును జతురంగబలసమేతంబుగా జమాబందీకి వచ్చియున్నారు. మనము వారి నెదుర్కోలు చేసి బహూకరింతము రమ్ము" అని నేఁ జెప్పినట్లు చెప్పెనఁట! చెప్పినంతలో బుస్సియెవఁడు హైదరెవఁడు పొమ్ము రమ్మనుటకా విజయరాముం డెవఁడని నిరసించి వానిం బట్టి చావఁగొట్టిరఁట!

హా! హా! సాహెబేంద్రా! నాకు మిక్కిలి యవమానంబు గలిగినది గదా. రావువారికి మీ రధికారు లున్నా రనుమాటయైన లేదు. మీ కిదివఱకే బొమ్మ గట్టినారు సరిగదా సమయము వచ్చినప్పుడు పిండి వెట్టం దలంచి కూడ యున్నారు. యవనేశ్వరా! వారిపట్ల నే నెంతయు నసమర్థుండ. నన్నెట్లు రక్షింతువో భారమంతయు మీ మీఁదనే వేసి యున్నాఁడను. ఇంక దేవర చిత్తము. నా భాగ్యము.

హైద—(హుంకా పీల్చుచు) రాజా మాకీ వాక్ హాలచ్చం సేస్తారూ? యేమ్టీ మాటా సెప్తావు? మాకీ హింతా నమ్మకం లేద్. మాభలం వార్కీ తెల్వాకా పోద్. నీకీ ఫర్వానహీ వుండు భాయ్!

విజ—ఖాఁ వర్యా!

గీ. ఎంత చెప్పినఁ గాని నా స్వాంతమందుఁ
గుదురు బా టింతయును లేక కుందు మన
బలగము ఫిరంగు లాకరమొత్తు పాపరాయఁ
డొకఁడె త్రెళ్లుకో వారి నుక్కడఁప.

హై—మాకీ మించి వారికి జబర్దస్తీ క్యా భాయ్! నీకి హింతా భయ్యాం లేద్. సంసయం లేద్. మేమూ దేసాలన్నీ గెల్చినామ్. నీకీ తెల్వాదూ వుంది. మాకీసూస్తే ముల్కుల్ ముల్కుల్ గడగడా గడ గడా వడుకుతాయి భాయ్! బొబ్బిలీ గిబ్బిలీ లచ్చం లేసదీ మాటా సెప్పి ఫాయిదా వున్నదీ లేద్. ఖైర్! బొబ్బిల్కా తారీఫ్ క్యా రాజా?

విజ—తురుష్కవంశాగ్రణీ! మీ రంతటిబలపరాక్రమవంతులే యనుట కింతయును సందేహము లేదు. కాని బొబ్బిలిపద్మనాయకుల శౌర్యం బనివార్యం బాకర్ణింపుము.

ఉ. గిబ్బవజీరు మమ్మెన్నసలఁ గేరెడువాలున కైనఁ గానగో
బొబ్బిలికోట కైనఁ గను పించెదఁ నించుక వాడి వీడటల్

బొబ్బిలిపిటికోట నడిఁ ♦ బుట్టినదోమయు వాఁడిపోడిమిన్
గొబ్బున మత్తవారణముఁ ♦ గోల్తల సేసెడుఁ బట్టి నెట్టనన్.

హై—ఖైర్ బొబ్బిల్లడిమే కైసా బందోబస్తు వున్నాడీ? కెత్నా లష్కర్ ఖాంయీ!

వి. జ—

శా. బాబో! బొబ్బిలికోటకొమ్మల నరా ♦ బాగా పయస్తంభముల్
రాఁబో నీఁగకుఁ జోటు లేనటులు ని ♦ ల్వం జేసి నల్చక్కి మేల్
డాబాలన్ బురుజుల్ శిలాఫలకముల్ ♦ సంధించి నిర్మించి బం
దోబస్తై చనఁ జేసి రందు బల ముం ♦ డు న్వేల వే లెక్కగున్.

హై—అచ్ఛా! రాజా! వారకీ బహూంత్తారీఫు చెప్తార్. వారీమే యెంతా వస్తాను ల్వున్నాది సెప్పు విజయాం!

విజ—సాహెబేంద్రా! వారందఱును సిస్తుగల వస్తాదు లేవి నుము.

సీ. కాంచను కాంద్రను చును ♦ దీర్ఘిండు కోల్పువి,
తాండ్రపాపారాయ ♦ ధరణివిభుఁడు
తోఁకఁ ద్రొక్కిన లేచి ♦ వీఁకఁ జూపెడుకోడెఁ
త్రాఁచు వేంగళరాయ ♦ రాజవరుఁడు
వడి బొబ్బరించు క్రూ ♦ ర్వ్యాడిసింహాం బినృ,
గంటి న్నృసింహరా ♦ డ్ఘనయశుండు
సరభసంబున దాటు ♦ శరభుఁబు దామెర,
ధర్మరాయాభిఖ్య ♦ కర్మఘుండు
తే. మఱియుఁ జెలికానివేంకయ ♦ మంతెనాన్వ
వాయబుచ్చెన కాకర్ల వంశ వేంక
టాఖ్యుఁడును గోల విఖ్యాతి ♦ నలరు యోధు
లోఘటింపరు ఘూరాజి ♦ సాహెబేంద్ర.

శా. రంగారాయఁ డభంగసంగరమహా ♦ రంగప్రదేశంబునన్
రంగత్పూతనిశాతహేతిఁ గొని శౌ ♦ ర్యస్థైర్యముం ధాద్రియై
గింగుర్వెట్టఁగ మొట్టిన స్మనఫిరం ♦ గీలు న్ఫరంగీలునున్
భంగం బందుట కేమి లెక్క మఱి భూ ♦ భాగంబు ఱల్లాడఁగన్.

హైద — రాజా! ఖతేవస్తామనుకున్నావా! నీకీ బడాలష్కరువున్నాదీ విన్నావా. లడాయికీ యితా హాడలీ పోతావు ఫరవా లేద్. వాస్కీ నీవ్రా పోయీా యుద్ధం సైవోంగా!

విజ — అంతభాగ్యమే నాకున్నచో నేనింత చింతింప వలసినపని యేమి దేవరా! బలపరాక్రమహీనుండను గనుక నే మీామీా సాయము వేఛింపవలసివచ్చినది. లేకున్న వారివలెనే నేనును మీాఫరవానా పాటింపకే యుందును.

హైద — (ఆగ్రహముతో) హారేరే! మాఫర్వానాకు రద్దు చెప్పిస్తాడు. వాడ్కు యిట్టే లడాయి పెస్తాన్ గోరీకర్తాన్ దేఖో. (హుకా గొట్టము బాఱవైచి) కోన్ రే! లాఘూఖాన్! లాసూఖాన్! హాసనల్లీఖాన్ జానూఖాన్! మహమ్మదుస్సేన్! సిద్దీబిలాల్! జల్దీజల్దీ లడాయికీ తయార్. (లేచి కోపముతోఁ గేకలు వేయుచున్నాఁడు.)

భటుఁడు — (ప్రవేశించి) సర్కార్! బుస్సీసాహెబ్ కాసవారీఆతీహై.

(అంత నంగరక్షకులతో బుస్సీ ప్రవేశించుచున్నాఁడు.)

అందఱు — (సలాములు చేయుచున్నారు.)

బుస్సీ — సలాం. సలాం. (అగ్రాసన మధిష్ఠించుచున్నాఁడు.)

అందఱు — (ఆసీనులగుచున్నారు.)

* బుస్సీ — హైదరుజంగ్! అనకాపల్లినుండి మనము వ్రాసిన రెండవ తాఖీదునకైన బొబ్బిలిరాజు వచ్చి పైక మిచ్చినాఁడా? లేదా?

---

* బుస్సీ చెప్పినమాట లన్నియు నన్యదేశభాషాస్వరములతో నీపుస్తకమందున్నట్లు గాని సమయానుకూలముగా నించుక మార్చి కాని ప్రదర్శింప వచ్చును.

హైద—సర్కార్! వాడికేధ రేమిహుజూర్! మనలచ్చేంవాళికైనై. మనకీ మార్నెకు తయ్యారు వున్నాఁడు విన్నాన్.

బుస్సీ—ఇది నిశ్చయమా? ఎవరు చెప్పినారు?

హైద—నిచ్చయం నిచ్చయం. హీవిజయరామ్ రాజా ఖోలీనాడు సర్కార్!

బుస్సీ—(విజయరామరాజుం జూచి) ఏమివృత్తాంతము?

విజ—సకలభువనేశ్వర! నేఁను దేవరదర్శనార్థము నకాపల్లికి వచ్చుచు వారి యుద్యమ మెట్లున్నదో చూత మని బొబ్బిలి కొకదూతం బుచ్చితిని. వాఁడుపోయి వారి సమరప్రయత్నమంతయుం దెలిసికొనివచ్చి చెప్పియున్నాఁడు.

హైద—సూదర్శణానికి హాడూ రాలేదు నిజం వుంది ఇదేవమాకీ దాఖలా సెప్తాదీ. నీకీ దూతా సెప్పా నేమి! వోయ్.

బుస్సీ—పాపారాయుఁడు మహాశూరుఁడని విని యుంటిమి. మనము బొబ్బిలి గెలువలేము. జమాబందీ మాని మఱలి పోవుదము లెండు.

విజ—(దిగులొంది తనలో) అయ్యో! ప్రమాదమే తటస్థించినది. అయిననిట్లు చెప్పెదంగాక. (ప్రకాశముగా) వరాసువంశతిలకా!

మ. ఇపు డాపాపయ లేఁడు వీట మన మి ♦ ట్లేతెంచుటల్ వించుఁ దా
నుపరోధింపఁగ మార్గమధ్యమున నై ♦ యున్నట్టిరాజాముసుక్
గృపణుం డాతఁడు సేనతోఁ జనె ని ♦ క్కీ తెంచియే నేను మి
మ్మపమార్గంబున నడ్డఁ దెచ్చితి నిలే ♦ దావంతయుం జింతిలక్.

ఇట్టిచో మనమా బొబ్బిలిగడీ ముట్టడించి జయించుట సులభసాధ్యంబు మన ఫిరంగి యొకటి ప్రేలిన దనినంత నే కోటయుం బెట్లిల్లుమని ప్రేలఁ గలదు. రావువారిపంచసహస్రపరిమితాకంబయిన స్వల్పసైన్యంబును మనమహాసైన్యంబు గెలుచుట దుర్లభంబు గానిది గాదు. అలాంతులగు

బొబ్బిలివారినే మీరు వశముచేసికొనలేకున్నచో మీకు మఱియెవ్వరు వశులగుదురు ?

హైద—సర్కార్ ! బొబ్బిలిగఢీ హమారాలాడూఖాకు ఏకు లాడూహై. దీస్కి యింతజర్వాలాజరూరత్ లేద్. రాజా బోలినట్లు మనయధికారం సెలాయింపునైయితే నామోషీ వున్నాది. బహుత్ నామర్దావున్నాది. నాలీసు వున్నాది. నాకు బేమానీ పేరు వున్నాది. హుకుంసే చనంకీ కోటా గూలీపోకె హుకుం దేవ్. హుకుం దేవ్.

సేవకుఁడు—(ప్రవేశించి) సలాం సలాం బందగానేయాలీ ! పచిలీ బాదరుసే హమారా గోరుందొరాకా మర్తెకెఆయాహై.

బుస్సీ—మర్తెను వచ్చినాఁడా ? సరే. రమ్మని చెప్పుము (హైదరు దిక్కు మొగమై) కర్తవ్యమాలోచించి చెప్పెదను. నాకు మర్తె నుతో మాట లాడవలసి యున్నది. మీరు— (అర్ధోక్తియందు)

హైద—హుజూర్ ! మేం లష్కర్కు హుషార్ సెప్పి వస్తాము సెల్వాదేవ్. (అని విజయరామ హైదరుజంగులు సేవకుఁడును నిష్క్రమించుచున్నారు.)

మర్తెకె—(ప్రవేశించి సలాముచేసి) ప్రభువరా ! గోరుందొరగారు మీదర్శనము చేసి మీ కీజాబిమ్మని నాచేతి కిచ్చి పుచ్చినారు.

(అని జాబు నిచ్చుచున్నాఁడు.)

బుస్సీ—(పుచ్చుకొని విప్పి చదువుకొని యాశ్చర్య మభినయించిమనలో) ఈహైదరుజం గెంతమోసగాఁడు ! దుర్మార్గుఁడైన విజయరామ రాజునొద్ద లక్షలకొలఁది లంచము పుచ్చుకొని ధర్మాత్ములు సత్య సంధులైన బొబ్బిలివారిం జెఱుపఁ దలఁచినాఁడు నే నేమియు నెఱుంగక వీనిమాయలోఁ బడి నిజముగా బొబ్బిలివారు సర్కారుపన్నుఁ గట్టక యెదిరించిరని వారిమీఁదికిఁ గ్రూరాత్ముఁడనై యుద్ధమునకు వచ్చితిని. విజయరామరాజు బొబ్బిలివారిని నాశనముచేసి వానికోట తనస్వాధీన

ము చేసికొనుటకుఁ జేసినమోస మిది ధనముఁ గాశించిహైదరుజంగు పాపమున కొడిగట్టినాఁడు. ఇది యిట్టిది గనుక నే నామిత్రుఁడాగోరుం దొర యిట్లు నాకుఁ దెలియఁబఱచినాఁడు. కాని వీరి నెట్లు చేయవలెనో యట్లు చేసి నే నిటనుండి మఱలి పోయెదంగాక ! (ప్రకాశముగా) మంచిది నీవు పొమ్ము. తగునట్లు ప్రవర్తింతు నని గోరుందొరతోఁ జెప్పుము. (జాబు వ్రాసి యిచ్చుచున్నాఁడు.)

మర్తే—(జాబు కొని సలాము చేసి నిష్క్రమించుచున్నాఁడు.)

(అంత హైదరుజంగును విజయరామరాజును భయముతోఁ బ్ర॥)

బుస్సీ—(కోప మడంచుకొని) హైదరుజంగ్ ! బొబ్బిలివారుపన్ను గట్ట లే దనియే కదా మనము యుద్ధమునకు వచ్చితిమి. వారు మన కీవలసిన పన్నంతయు నిచ్చివేయుటకు సిద్ధముగా నున్నట్లు తెలిసినది. మన మిపు డేమి చేయ వలసి యుండును ?

హైద—(భయముతో విజయరామరాజుంజూచి చేయుద్దుపెట్టిరహస్యముగా) రాజా ! గోరుందొరా యేమిటీవో రాసీ వున్నాడ్. మన హాలోసనా వీస్కి తెలిసీ వుందీహేమో ? ఖయిర్ నీకేఫికర్ లేద్ మియా! నేఁ సెప్తాఁ సూడు. ధైర్యం వుంది (ప్రకాశముగా) సర్కార్! వారు బారాసంవచ్చరాల్ పన్నూ కట్టకా పోయ్ తాఖీదుల్ రాసీ రాసీ వారూ రాకాపోతే యుద్ధంకీ వచ్చీనాం మందీ తప్పూనై వుందీ. దీన్కి మీంహాలోసించవాలా జరూరత్ బీ నై సర్కార్ !

బుస్సీ—ఈవిజయరామరాజు మాత్రము పన్ను గట్టుచున్నాఁడా ?

హైద—హీంతఁడు తనాసేతీకిందవార్ వసూ లీకా పోతే దేవంపండ కాపోతే కట్టాలేద్ అని సెప్పుతాఁడు సర్కార్ !

బుస్సీ—వారు కూడ నట్లే యని మన మూహించుకో రాదా ?

హైద—సిత్తం సిత్తం కాని హామారాతాఖీద్ రద్దూసెప్పి దర్షనాస్కి రాలేద్ విజయరాజా రాజమంద్రి వొచ్చి నాడ్ ఆదా యిస్తాన్

సెప్పి మసిపీ సేసూ కున్నాడ్ మనమూ కటాచ్చించినాం.

బుస్సీ—ఇప్పుడు వారీవలసినదే గాక దాని కిబ్బడి యిత్తురట వారి నేల కటాక్షింపరాదు.

విజ—(తనలో) మనస్సంకల్పము వికల్పమగునట్లుయున్నది. నే నేమి చేయుదును దైవమా!

బుస్సీ—(ఆగ్రహముతో) హా! మీరిద్దఱును మహాద్రోహులు (హైదరుంజూచి) నీకీరాజు లక్షలకొలఁది లంచమిచ్చుటం జేసి యితని మాట విశ్వసించి నీవు నన్ను మోసపుచ్చి యిటకుఁ దోతెచ్చి బొబ్బిలి వారిం జంపింపఁ దలంచినావు. నీవు నాదివానుగా నుండుటకును ఇతఁడీ కళింగదేశాధిపుఁడుగా నుండుటకును దగరు. కానీ! తొందరపడకుఁడు. మిమ్మెట్లు చేయువలయునో యట్లు చేసెదంగాక.

ఇద్దఱు—(భయ మభినయించుచున్నారు.)

విజ—(గడ గడ వడఁకుచుఁ దెరచాటునకుఁ బోయి రూపాయల సంచులం దెచ్చి బుస్సీయెదుటం బెట్టి) మహాప్రభూ! నన్ను రక్షింపుము.

చ. అరయఁగ మేకవన్నెపులు ♦ లావెలమల్ పయికెంత మొత్తఁగా
బెరిమ లారవోలెఁ గను ♦ పింతురు దారద నైన నగ్గులై
పరులను గాల్చి వెతురు భ్రమ ♦ వంబుగ నెన్నటికైన నాకునుం
దొరలకు వారిచే వ్యతియె ♦ తోఁచెడు నిక్క మిది విన్నవించితిన్.

(తెరలోఁ గలకలము)

బుస్సీ—(నిర్వేరపడి) ఏమీ! దీనాలాపములు వినిపించుచున్నవి. రాజా! అది యేమో?

విజ—

శా. దేవా! యేమని చెప్ప నేమగుచునా ♦ ర్తింగూర్చునో కాని దు
ర్భావుల్ రావుకులీను లెట్టిపనికిన్ ♦ గర్వాంతయుం గొంక రెం

తేపిర్యంబున నుంద్రము నేఁడు మనవా ♦ రెండే నరణ్యంబునం
బోవం బట్టి వధించి రంగుం దెలిసె. ♦ బోనాకు లోకేశ్వరా.

బుస్సీ—ఔహా! నిరపరాధులం బట్టి చంపిరా రావువారు? వారు గోరుందొర వ్రాతలం బట్టి నిరపరాధులు సాధులని నిర్ణయించితినకటా! యెంత క్రూరు లెంతపని చేసినారు? వారె శిక్షకు నను సమర్థులు. వారి పట్ల నింకఁ గనికరించుట న్యాయంబు గాదు కానిండు మనవచ్చిన పని తుదముట్టింపుఁడు. ఇంక మీరు మీమీ సేనల సన్నద్ధంబు చేసికొని పోయి కోట ముట్టడింపుఁడు మీ కిదె యాజ్ఞ యిచ్చుచున్నాను.

హైదా—సర్కార్! హమారా రామారావ్ చెప్పినవార్కి ణమ్మకం లేకా మాకిక్రోధం సేసినార్. ఇపుడు తెలిసిపోయిందీవుంది. మేంపోయిచనం లో బొబ్బిలీ నాషణం సేసీ వస్తామ్ సిత్తం హుకుం సర్కార్ హుకుం.

ఇద్దఱు—(సలాము చేసి సంతోషముతో నిష్క్రమించుచున్నారు)

బుస్సీ—(రూపాయలసంచులం బట్టి చూచి) హా! హా! నేనుబుట్టి యెప్పుడు నిన్నిలక్షలరూపాయలం జూచి యుండ లేదు. నాపుణ్యము మంచిది గనుక నాకింత సొమ్ముకు సారిగా వచ్చినది. బొబ్బిలివారు మంచివారు కానీ కాకపోని నాకు సొమ్మే ప్రధానము. విజయరామ రాజు మిక్కిలి మంచివాఁడు నాకింతసొమ్మిచ్చినాఁడు. బొబ్బిలిం గొట్టి వీని కిచ్చుటయే నిశ్చయము. గోరుందొర కేమి తెలియును. అతఁడేమి వ్రాసిన నాకేమిభయము. దానిసంగతి తరువాత విచారింతముగాక (ఇటునటుం బరికించి) ప్యూన్!

జవా—(ప్రవేశించి సలాము చేయుచున్నాఁడు.)

బుస్సీ—ఈసంచులం దీసికొనిపోయి నాడేరాలో భద్రము చేసి దుబాసి లక్ష్మన్నం బిలువుము.

జవా—సిత్తం సిత్తం. (సంచులు మోచికొని పోవుచున్నాఁడు.)

(అంత దుబాషిలక్ష్మన్న ప్రవేశించుచున్నాఁడు)

లక్ష్మ—(సలాముచేసి) మహాప్రభూ! దేవరయాజ్ఞ యేమి?

బుస్సీ—లక్ష్మన్నా! కూరుచుండుము. బొబ్బిలివా రిప్పటికయినను మనదర్శనమునకు రాలేదు గద? యుద్ధము కావలసినదియేనా?

లక్ష్మ—ప్రభువర్యా! బొబ్బిలివారు—

మ. ధనవంతుల్ బహుశౌర్యవంతులును వి ♦ ద్యావంతులున్ వారికిన్
మనలక్ష్యం బిసుమంత లేదు మనలన్ ♦ మన్నింపఁగా రారు రా
మనరేంద్రోక్తులు సత్యముల్ మనలం జం ♦ పన్ యుద్ధసన్నద్ధులై
పనులం జేయుచునుంట నిక్కము సుచున్ ♦ భావింపఁగా నయ్యెడిన్.

గీ. వారి యుద్ధప్రయత్న మిా ♦ వరుస నున్న
దేమి చోద్యము చెప్పంగ ♦ లేము గాని
దామెరకులీనుఁ డగుధర్మ ♦ నాయకుఁ డిపుడు
వచ్చె నట నుండి యిట ♦ రాయబారి యగుచు.

బుస్సీ—ఏడీ యెక్కడకు వచ్చినాఁడు? వాని యభిప్రాయమేమి?

లక్ష్మ—నాకడకు వచ్చి "రావువారు సంధి చేసికొందురు బుస్సీ దర్శనము చేయింపు" మని నన్నుఁ గోరినాఁడు.

బుస్సీ—విచారించెదము గాక పిలిపింపుము.

లక్ష్మ—(భటునిం బిలిచి) నాపటకుటీరంబుననున్న వెలమదొరం దీసికొనిరా పో.

భటు—సిత్తం సిత్తం. (నిష్క్రమించుచున్నాఁడు.)

(అంత నాయుధపాణి యగుధర్మారావు ప్రవేశించుచున్నాఁడు.)

ధర్మ—(వంగి బుస్సీకి సలాములు చేయుచున్నాఁడు.)

బుస్సీ—(కూరుచుండ నియోగించి) అయ్యా! మిా రెక్కడనుండి వచ్చుచున్నారు? ఏమిపనినిమిత్తము వచ్చినారు?

ధర్మ—రాయబారి నయి దేవరవారి దర్శనార్థము బొబ్బిలినుండి వచ్చుచున్నాను. నాపేరు ధర్మరా యందురు.

బుస్సీ—సరే! మీరాయబార మేమి?

ధర్మ—దేవా! చిత్తగింపుము.

చ. సుజనులు రావువారు పరి ♦ శుద్ధమనస్కులు మానభూషణుల్
ప్రజలకు నిష్టులెప్డు ప్రభు ♦ భక్తిగలారును; తద్వరోధియౌ
కుజనుఁడు రామరాజు తన ♦ కుంగలవైరము దీర్చుకో మహా
వృజినము లాడి మీకుఁ బొర ♦ వెంచె నొకించుక లేనిపట్టునన్.

బుస్సీ—ఆవెలమవారికడ తప్పు లేదనుట నిజముగునా? అయినచో మాకుఁ బన్నికుంట యేమి? మాకడకు రాకుంట యేమి?

ధర్మ—దేవా! పండక పన్నియ లేదు. దుష్టాత్ముఁ డగురాజు మీకడనుండుటం జేసియు మొదట మీరాక మాకుఁ దెలియకుంటఁ జేసియు మీదర్శనంబునకు రాలేదు కాని మఱియొండేమియును లేదని విన్నవించుచున్నాను.

బుస్సీ—విజయరామరాజు మీకడకు దూతం బుచ్చియుండలేదా? మొదటఁ దెలియ దంట వేమి?

ధర్మ—“బుస్సి సపరివారుండయి వచ్చియున్నాఁడు. మమము పన్నిమని చెప్పుదము. దానికతండొప్పకున్న సంహరించి వత్తము. మీరును రం”డని మొన్న మొన్న వర్తమాన మంపుచు దూతం బుచ్చినాఁడు. దానికి మే మంగీకరింపక వానితో రాలేదు. ఇది నిశ్చయము.

బుస్సి—ఈమాట కేమి! బొబ్బిలివారు మిక్కిలి శౌర్యవంతులు బలవంతులు. బుస్సి లక్ష్యము మన కేమని యుపేక్షించినారు. సమయము వచ్చిన మాకుఁ బిండివెట్టం గూడఁ దలఁచినారు. ఇది నిశ్చయము.

ధర్మ—

చ. హరహర! మీర లిట్లనుట ♦ న్యాయముగా దటువంటిగర్వ మా
దొరలకుఁ గల్గ దెప్పటికి ♦ దోర్బలశాలులె మైన మీకడన్

గురుతరభక్తిమై నడచు ♦ కొందురు దుష్టుని దుష్టబోధనల్
గర మలుకల్ వహింపఁ దగు ♦ నా యిటు లోజగదేకవల్లభా.

ఉ. కప్పముఁ గట్ట లేదనుచుఁ ♦ గల్గిన తప్పున కంత కంతగా
నిప్పుడె కట్టి మీసెలవ ♦ యే నలబొబ్బిలితేఁడు వచ్చి నా
తప్పు క్షమించి తుంచు మని ♦ తావకపాదము లాశ్రయించు నో
యప్ప, దయారస బు హృద ♦ యంబున నంట ననుగ్రహింపవే.

బుస్సీ—ఈమాటల కేమిలే! బూటకంబు లెన్నయినం బలుకవచ్చును. సమయము దాటి పోయినది. అయినను మీ రాజు బుద్ధిమంతుఁడై కొంతకాలము ప్రవర్తింపఁ దలఁచునేని విజయరామరాజుం బ్రార్థించి యొడంబడిక చేసికొమ్మనుము. లేదేని సకుటుంబముగాఁ గోట విడిచి యెందేనిం బొమ్మనుము. అట్లు కాదేని మానూఱువేలమూఁక లొక్కట పెట్టునం బడి బొబ్బిలి నున్మూలించుటయే నిశ్చయంబు. మీ బాహుబలంబు మాఫిరంగికడం బనికిరాదని మఱిమ్మాటికిం జెప్పుము.

ధర్మ—[కోపం బడంచుకొని]

ఉ. బూటక మాడ నే విజయ ♦ భూపతిదూతను గాను సత్యమా
ర్గాటుఁడు రంగరాయమను ♦ జాధిపుదూతను గాని మీకు నిం
తేటికిఁ గ్రొర్వ్య? మాకులెఱుఁ ♦ డే?ప్రియుండ? తదాశ్రయంబు మ
మ్మేటికిఁ గొమ్మటంచు వచి ♦ యించుట? నెంచుట లిట్టు లొప్పునే.

మ. పరుకంటన్ బడరాని పుణ్యవతులున్ ♦ భార్యాదులున్ బిడ్డలున్
బరివేష్టింప విశేషవైభవములన్ ♦ వర్తింపనై యొప్పుమా
చిరకాలార్జిత మైన కోట విడి వా ♦ సిం బాసి నానామహీ
శ్వరసంసేవితపాదపీఠుఁ డగుమా ♦ యూర్మజానిఁ బొమ్మందువే?

బుస్సీ—[ఆగ్రహముతో] నీచదు వింకఁ గట్టిపెట్టుము. మీ రాజేంద్రుఁడు విజయరామనరేంద్రునికిఁ బాదాక్రాంతుఁడై సంధి చేసికొనుట యో కాక సకుటుంబముగా బిడుమని శ్రానీలతోఁ గోటవిడిచిపోవుట యో

చేయఁజేసి మహాయుద్ధంబు సిద్ధంబు. అందు మాకు విజయంబు సిద్ధాంతంబు. అని మీరాజుతోఁ జెప్పుము. ఇంక మా రాడితి వేనినిను వెడల నడపింతు నని తెలిసికొమ్ము.

ధర్మ—[కాలాగ్నిరుద్రుఁడయి కనలి పండ్లు పటపటం గొఱుకుచు]

శా. ఏమేమీ! యిటు చెందనాడెదవు లో ♦ నింతేనియుఁ ధర్మముఁ
మామర్యాదయుఁ జూడ నెంచవు జగ ♦ న్మాన్యప్రతిష్ఠాన్య లీ
భూమీశుల్ నడికోర్వ రాయుధముల ♦ బోల్పొందఁగా నెంత్రు నీ
వీమాత్రంబు నెఱుంగలే వయితి పా ♦ పీ! వాపసంజూతు వే.

[అని లేచి కత్తిఁ దాటింప నుంకించుచున్నాఁడు.]

బుస్సీ—[గడగడ వడంకుచు లక్ష్మన్నతో రహస్యంబుగా] హాహా! మహోపద్రవము వచ్చినది. న న్నీయుపద్రవంబునుండి యెట్లు తప్పిం తువో తప్పించి నాప్రాణము రక్షింపుము. (సంభ్రమించుచున్నాఁడు.)

లక్ష్మ—(ధర్మారావుం దరిసి ప్రార్థించుచు) ధర్మరాజా!

చ. త్వరపడకయ్య బూసిదొర ♦ వాసియెఱింగినవాఁడు మీపయిం
గరుణ దలిర్చు నట్లు వెను ♦ కం బొనరించెద నిప్పు డాఁకటం
జిరచిరలాడుచుండె మన ♦ చెప్పినమాట చెవిం బడంగఁ బో
దరముఁగఁ గార్యము ంజెఱచు ♦ నట్టివిధం బిది నీకుఁ జెల్లునే.

ధర్మరాయాగ్రణీ! నాచెప్పినమాట లన్యథా ప్రవర్తింపఁ జేసి నీ వి ట్లాగ్రహంబునఁ గత్తి నెత్తుట కార్యానుసంధానంబు గాదు. శాంతిం పుము. శాంతింపుము. [చేయిపట్టుకొనుచున్నాఁడు]

బుస్సీ—[పాఱిపోవుచున్నాఁడు] (తెరలోఁ గలకలానంతరము)

శా. నిన్నుం బట్టఁ దలంచినా రరులు ని ♦ స్త్రిద్రప్రతాపప్రభా
వౌన్నత్యంబున నక్కలంకుల బలం ♦ బాసన్నమై యుండె మా
కు న్నీచెంతకు రాగ నాఁక కడియెం ♦ గ్రూరాసివారంబులన్
గన్నా నైనకృపాణ మే జతగ రా ♦ నల్పొంహు ధర్మప్రభూ.

ధర్మ—(ఆకర్ణించి తనలో) పరులు నన్నుఁ బట్టికొందు రని నా భటులు నాకుం దెలియఁ బలుకుచున్నారు. నే నిటనున్న నాకు భంగంబు గలుగు ననియే తోఁచుచున్నది. విజయరామాదులు మహానీచులు. నీచప్రకారంబులకుం బ్రయత్నించువారు (అటునిటుంజూచి మహాలాఘవంబునం బఱవఁదలంచుచున్నాఁడు.)

(తెరలోఁ గలకలానంతరము) గిర్తే మారో. మారో. పకడో. పకడో.

అంత హైదరుజంగును, విజయరామరాజును, ఇరుగడ నిలువ విచ్చు కత్తులతోఁ బరవళ్ళుదొక్కు- వీరభటులు ప్రవేశించుచున్నారు.)

ధర్మ—(చూచి తప్పించుకొని పాఱిపోవుటకుం బ్రయత్నించుచు నిటు నటుం బఱువు లెత్తుచున్నాఁడు.)

హైద—కోఁ రే వస్తాద్! లాడుూఖాన్! ఐసాగిర్తే హైబద్మాష్. మారో మారో. పకడో పకడో.

విజ—ఓహో ప్రధానయోధులార! ఇతండు ముదిసినవాఁ డయ్యును మిక్కిలి లాఘవమ్ము గలవాఁడు సుఁడీవీరా!

చ. ముదుకఁడు ద్రోణుఁడెట్లు రణ ♦ భూముల శత్రులు మట్టడించినన్

బెదరక లాఘవంబు మెయి ♦ భీరము తోరముగా మెలంగునో

ముదిసిన నీతఁ డట్లు మన ♦ ముదర నున్నటు లుండు నంతలో

నదను గ్రహించి కన్మొఱఁగి ♦ యవ్వల దాటుఁజూడి రయంబునన్.

హైద—తూరిగలాగా యెగిరి పోతాడు వుంది. వీడికి బట్టవాలా మనికి ఖట్టా అవుతూవుంది కానీ వస్తాద్ లాడుూఖాఁ! దేఖో దేఖో పకడో పకడో.

భటులు—(పరువు లెత్తుచున్నారు.)

ధర్మ—(ఇటునటుం బఱచుచుఁ గత్తిఁ ద్రిప్పుచు నెగిఱిపోవును.)

భటులు—(సంభ్రమముతో) అరే రే రే బద్మాష్ గయా హై మారో మారో. (తుపాకులు ప్రేల్చుచున్నారు.)

విజ—(నివ్వెఱపడి)

గీ. మెఱపు మొఱసినచందాన ♦ మెఱసి మెఱసి
కంట మసిఁ బ్రామి మనలఁ ♦ గంటు వఱచి
దూత ముదుకండు గికురించి ♦ దూఱె సకల
మనప్రయత్నము విఫలమై ♦ మంటిఁ గలిసె.

హైద—బుడ్డాఅద్మీ బడావస్తాద్ వున్నాడు! మనకి బొమ్మా గట్టి మనీవారినీ చావాగొట్టిపారీనాడ్. హెంతమోషం. మనం వరామోషీ చేసీనామ్ చనంతప్పీపోతే బుస్సీతలా తెగీ పోఁ. హెంత మోషం! హెంతమోషం.

విజ—ఖాఁ వర్యా! కడచినదాని కింతచింతింపం బని లేదు. మనకు బుస్సీదొర యాజ్ఞ యైనది గావున మన మందఱము నిప్పుడే కోట ముట్టడింతము రండు. మనవృత్త మెఱిఁగి బొబ్బిలివారును యుద్ధసన్నద్ధులై యుందురని యే నానిశ్చయము. (తెరలోఁ గలకలము)

హైద—అచ్ఛాభాయ్! మనాలష్కర్మే డంకాబజాయింపూ అవుతూవుంది లెండు యుద్ధంకు తయ్యారు లెండు. పయానం కండు.

(అందఱు లేచి నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము.

---

శ్రీ

# బొబ్బిలి యుద్ధ నాటకము.

## తృతీయాంకము.

---

స్థలము: బొబ్బిలి సభాభవనము.

[వెంగళరాయఁడు, నరసారాయఁడు, చెలికాని వెంకయ్య, కాకర్లపూడి వేంకటరాజు, కొందఱు సేవకులును గొలువఁ గొలువుదీరి రంగారాయఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రంగా—మంత్రివర్యులారా! మచిలీపట్టణంబునకరిగిన మంతెన బుచ్చనయింత మసలుట కేమి కారణమో? గోరుందొర గౌరవించెనో లేదో?

నర—రాజాగ్రణీ! గోరుందొరకు మనపై గౌరవంబు మెండు. గావున మనబుచ్చన నాదరించి బుస్సికిం దెలియఁబుచ్చునని యే నా నమ్మకము.

వెంగ—

శా. ఆగోరుందొర బుస్సియొక్క తెగవా ♦ రాంతర్యముం దిర్వురున్
రాగం బొందిన వార లొక్కరుని ప్రా ♦ రంభంబు వేఱొక్కఁడో
బాగంచున్ వచియించుఁగాదనఁడెదం ♦ బాటింప నస్మత్కృతుల్
యోగింపన్ బుసికాతఁడేమయిన ప్రా ♦ యంబోయనంబోలునే.

చె వెం—క. వ్రాసినను వ్రాయుగోర్డొర
బూసి యొకింతయును దాని ♦ మున్నిడుకొనుచున్
వాసిఁ గనఁడు బుచ్చన కా
యాసమె కాకింతయైన ♦ సట ఫల మున్నే.

కా. వెం—

మ. అరయన్ రాజు నిశాచరుండు కలుష ♦ వ్యాపార పారీణుఁడున్
వరసచ్ఛ్రీకహరుండు నవాఁ డెపుడు నుర్ ♦ వర్తించు ఘోరామయో
త్కరమందున్ మచిలీపురంబుఁ జని తం ♦ త్రఁ బుంబొసంగించి గో
ర్ధారచిత్తంబు మరల్పనోపుబుసిపాం ♦ దు బొందితానుండుటన్.

రంగా—

మ. అకటా! మీరలీటాడఁ జెల్లునెదయా ♦ స్వాంతుం బుగోర్, రెడ్డినా
యకు దత్యుత్తముఁడాతనిం దెలుచునె ♦ ప్రత్యుద్ధతున్ రాఘవా
రికిఁ బక్షంబు వహించియుండు రెవ రే ♦ రీతిం బ్రబోధించినన్
సుకృతంబొక్క సుమంతయుండిన ఫలిం ♦ చుం గార్యమిప్పట్టునన్.

కానీ! మిత్రులారా! బుచ్చన నేఁడు వచ్చునని తెలియవచ్చినదికదా! రానిండు సర్వము విశదమయగు ధర్మరావుసంబోయి కొన్నినాళ్ళయ్యె నతనిజాడయును తెలియరాదయ్యె నరే. సేవకా! పురోపకంఠంబున కెదురేగి బుచ్చన రాక విచారించి రమ్ము పొమ్ము.

సేవ— చిత్తము (నిష్క్రమించుచున్నాఁడు.)

బుచ్చ—(ప్రవేశించుచుఁ దనలో)

మ. చతురుండీతఁ డటంచు నన్నుఁ బనిచెన్ ♦ సంధిం బొనర్పంగ నా
గతి యంతన్ వితయయ్యె నేనిపుడిటం ♦ గాన్పింపనేమయ్యె నో
హితుడా! కార్యమటన్నమన్నదొరతో ♦ కేమంచు వాక్రుచ్చెదన్
హితమున్ దేనికి గూర్పలేని మనుజుం ♦ డేలా? యొడల్ కాల్పనే.

హాహా! కాలము చెడ్డదయినప్పు డెంతవాఁడు నేమియుం జేయఁజాలఁడు గదా! కానీ కానున్నది కాకమానదు (సమీపించి) జయము జయము మహారాజా! (నమస్కరించుచున్నాఁడు.)

రంగా—[పరికించి] ఓహోహో! ఆడఁబోయిన తీర్థ మెదురైనట్లు మా బుచ్చనయె వచ్చియున్నాఁడు. మిత్రమా! రమ్ము పీఠ మలంకరింపుము.

బుచ్చ—(విశ్రమించుచున్నాఁడు.)

రంగా—మిత్రమా! గోరుదొర సుఖమైయుండెనా? విశేషమేమి?

బుచ్చ—గీ. గోరుదొర సౌఖ్యమున నుండెఁ ♦ గువలయేశ!

నేను మీరాయబారిని ♦ నా స్వతంత్ర

కుతుకమునఁ జేర రమ్మని ♦ కుశల మడిగి

గారమున మిమ్ము మెచ్చినట్ల ♦ గౌరవించె.

రంగా—విఁటిరా! మిత్రులారా! గోరుందొర వృత్తాంతము?

బుచ్చ—నేను రెడ్డినాయుఁడు ముఖంబున మన వృత్తాంత మంతయు వినిపించితిని. కాని విజయరామరాజు పరమదుర్మార్గుఁ డని నొక్కి వక్కాణించె.

రంగా—గోరుదొర యెప్పటికిని మనపక్షము వాఁడే. తరువాత?

బుచ్చ—వెలమదొర లుత్తమోత్తములు వారిపైఁ గలహింప వల దని యావద్వృత్తాంతమును దేట తెల్లఁగాఁ దెలియున ట్లొకజాబు వ్రాసి మర్తైన కిచ్చి బుస్సీకడకుం బుచ్చె.

రంగా—సరే! మన కింక దిగ్విజయమే. తరువాత?

బుచ్చ—జాబుం జూచి బూస్సీ హైదరు పై మండిపడినాఁడు.

వెంగ—మండిపడిన వాఁడు మండిపోయెనా? మఱి విజయరామ రాజో?

బుచ్చ—వానికిదిం ప్రాయశ్చిత్తమైనది.

రంగా—మిత్రమా! తరువాత?

బుచ్చ—మూసాబూసి రోసంబునం జేసి వారిం దూరి పోరు మాని పో సంకల్పించినాఁడు.

రంగా—(సంతోషముతో) తరువాత?

బుచ్చ—వారు మిక్కిలి జడిసి యుక్తిపంబునం గొంత ద్రొక్కము వాని కిచ్చి లేనిపోని నేరములెన్నో కల్పించిచెప్పి మనపై మరల నీసెక్కించినారు.

రంగా—ఛీ! ఛీ! బూసి గడ్డి గఱచి యంతలోనే పరాఙ్ముఖుఁడై మనపైఁ బడనెంచినాఁడా? కానీ! విచారించెదం గాక మిత్రులారా! ఏలయని నన్నుఁ దూల నాడెదరేమో? రాజులకుఁ జతుర్విధోపాయంబులు నత్యంతప్రయుక్తంబులు సుఁడీ!

నర—అన్వీక్షిక్యాదిరాజకీయధర్మంబు లన్నియు నెఱింగి మహారాజవైన నిన్నుఁగాదనువాఁ డెవఁడు? నీచేత నప్రస్తవనీయంబ కాని సామాన్యమా? చవిటినేల విత్తనంబంటకున్నఁబాలము కాపునిందున్నాఁడా! అది యటుండుఁగాక ద్వితీయఁబునన్నైన ధర్మరా వెట్లు కార్యంబు సాధించుకొని వచ్చునో?

వెంగ—ఆఁ! ఇతఁడు చేసినాఁడు అతఁడు చేయనున్నాఁడు! కానీ యీ చెవులతో డనే వినకపోవుదుమా?

[అంతఁ దత్తఱపాటుతో ద్వారికుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ద్వా—అయ్యలారా! నెత్తురు గడ్డలతో మనధర్మరావు తత్తఱపడి వచ్చుచున్నాఁ డది యే మాపద్రవమో?

అందఱు—[సంభ్రమ మభినయించుచున్నారు]

[అంత రక్తసిక్తాంగుఁడును సాయుధహస్తుఁడు నగు ధర్మారావు ప్రవే॥]

రంగా—[చూచి భయసంభ్రమములతో] మామా! యేమి యీ యుపద్రవము?

వెంగ—మఱేమియుం గాదు కొఱకుతురకలనఱకులచుఱుకు.

ధర్మా—నాసంధి వారి కనుసంధింపక నన్ను బంధింప నెంచిన వారి మర్దించి వచ్చితిని.

రంగ—ఏమివృత్తాంతము? అక్కల జరిగినది? ఇందు విశ్రమించి సాకల్యముగా నెఱిఁగింపుము.

ధర్మా—నేను బోయి ద్విభాషిలక్ష్మణునితో సంభాషించి తన్మూలమున నేకాకి యగుబుస్సి దర్శనము చేసి కార్యము దెస వాఁడనై చెప్పవలసినంత వట్టు చెప్పితిని. దానికి వాఁ డంగీకరింపక తన మాటకు

మాటాడిన నన్ను వెడల నడిపింతు నని పలికినాఁడు.

రంగా — దానికి నీ వూరకుంటివా ?

వెంగ — పాపమూరకుండ కేమి చేయును; మూఁడు కాళ్ళ ముసలి!

ధర్మా — (వెంగళరాయనిం జూచి తల పంకించి) రాజా ! ఊరకుం డునా ? మహాగ్రహంబునం గత్తి నెత్తి తల నెగుర వేయ నూకించితిని. కాని యంతలో దుబాసి నాచేయిపట్టుకొని సామం బనుసంధించినాఁడు. ఆసందున వాఁ డెటో పాఱిపోయినాఁడు.

వెంగ — (అనిష్టమునఁ జేయి విదులుపుచు) ఛీ ఛీ ఛీ ఛీ !

క. ఏమిపని చేసివచ్చితి వీమెయి సమయంబు దొరకె ♦ నా నేఁ గానీ
నామేన బావ గానీ యేమైనన్ వాని ద్రుంప ♦ మే? భీతాత్మా

గీ. ముసలివగ్గ ! నీవు ♦ పోనేల తగుదు న
మ్మా యటంచు నటకు ♦ నట్టి సమయ
మబ్బ వాని నేయ ♦ వైతివి నీకత్తి
యేల ? శౌర్య మేల ? ♦ యేల బ్రదుకు ?

వాని నొక్కని దెగటార్చినచో మన కేయిక్కట్టును లేకపోవును గదా ! ఎంతపని చేసితివి? ఎంతపని చేసితివి ? దుబాసిసామం బనుసంధించినాఁ డని చెప్పుచుంటివి. వాఁడు మాత్రము మంచివాఁడా? మన వలన లంచంబు దిని వానివలన నుపకరింపఁ జేయ నున్నపరమదురాత్ముఁడు వానింగూడ నీ కరవాలంబునకు ద్వితీయకబళనంబు సేయరాదా?

ధర్మా — (క్రోధముతో లేచి) ఓరి మూఢాత్మా !

క. ఏలా నీశౌర్యము కరవాల మ్మిది యేల ముసలి ♦ వగ్గా! యనుచున్
వేళాకోళము చేసితి వేలో కనుపింతు రమ్మి ♦ దే పస యున్నన్.

(అని పరవళ్ళఁ ద్రొక్కుచుఁ గత్తిం ద్రిప్పుచున్నాఁడు.)

నర — అన్నా! శాంతింపుము. శాంతింపుము. (చేయి పట్టుకొనును.

రంగా — (మోర బిగించి పండ్లు పటపట గొఱుకుచు)

చ. మనమునఁ గన్న గానకిటు ♦ మాన్యులతో నెకసక్కె మాడుచున్
ముదుసలి యింటి కూడు పడె ♦ మొన్నొనవాల్గల రుద్రుఁడో యనన్
గదనము సేయ వాలుఁ గొని ♦ క్రాలెడు దామెరధర్మరాజు నీ
మద మడి యేది మాత మొక ♦ మా తెదిరింపుము వీఁక నీతనిన్.

గీ. కండకావరమ్ము ♦ కాలుబు ప్రేలించు
మంచిచెడ్డ లెడ్డ ♦ నెంచ నీకు
పడుచువాఁడ ననుచుఁ ♦ బడి కొట్టుకొందువు
ముసలి ముసలి గాకు ♦ ముసలిగాని.

వెంగ— [లేవ నుంకించుచున్నాఁడు.]

బుచ్చ— [చేయి పట్టుకొని కూరుచుండఁ బెట్టుచున్నాఁడు.]

రంగా— గీ. బుద్ధి గలవాఁడ వేని నా ♦ సుద్ది విశ్వ
సించువాఁడవ యేని లో ♦ నెంచి శుభము
ధర్మరాయనికాళుల ♦ దండ మెఱఁగి
సైపు మంచును బ్రార్థింప ♦ నోపు నీకు.

నర— ధర్మరాయా!

గీ. అన్న చేతిక్రింద ♦ నన్నివిధంబులఁ
బెఱుగుచున్నయట్టి ♦ పిన్నవాని
మాట కింతకోప ♦ మా? నీకుఁ దగునయ్య
కన్నకొడుకుమీఁదఁ ♦ గత్తిఁ గట్ట.

(కూరుచుండఁబెట్టి) వెంగళరాయా! ఈతం డపుడు బుస్సి చేయుట సుకరంబు కాని దూతకృత్యంబు వహించి యుండుటం జేసి కార్యంబున కెక్కడ భంగంబు వచ్చునో యని సంశయించె నిది యుక్తంబు. నీకు దాయ చాకుండెఁ గా యని కోపంబు కాని వేఱొండును లేదు.

వెంగ— [లేచి ధర్మారావు చెంగటికిం జని చేతులు జోడించి]

చ. ఎఱుఁగక తప్పు చేసితి న ♦ హీనపరాక్రమ! దాయ నేఁడుఁగా
దొరకక పోయెఁగా యనుచుఁ ♦ దోరపుగిన్క మదిం గలంప నుం

డరయఁగ లేక దేవగురు ♦ వంతమహాత్ము లీఁ దూల నాశితీఁ
దురితము గట్టికొంటిని న ♦ నుం గొమరుం డని సైచి కావవే.

(కాళ్ళమీఁదఁ బడుచున్నాఁడు.)

ధర్మా—[లేవనెత్తి] వత్సా! వగవకుము. మన కెంతశౌర్య మున్న నంత శాంతం బూనుటయె విభూషణంబు. బుస్సి నేసినంతం బోవునా? పైన సాబ్జఙ్గు లేఁడా? యితం డసమర్థుఁడా? మమ్ముఁబోంట్లు నీ చెప్పినట్లు వేగిరించి రాజకార్యవిఘాతంబు సేయ వచ్చునా? పడుచుతనం బెల్లెడం బనికి వచ్చునా?

రంగా—

శా. మామా! మాటలురాని బాలుఁడుమహా♦ మాత్సర్యగర్వామయో
ద్దామస్వాంతుఁ డితండు యౌవనమదో ♦ద్గారంబునం గానలే
కీమై మాన్యుల ధిక్కరింప విన న ♦ య్యోం దప్పు సైరించి నన్
నీమేనల్లుని నిర్మలాంతరమునన్ ♦ వీక్షింపుమీ ప్రేమెక్కఁ దన్.

ధర్మా—రాజా! దీని కింత యేమిటికి? మన వేంగళరాయఁడు నాకుఁ బుత్రప్రతిమునింపు గాని శత్రుండా? ఆతని మట్టిది. అది యట్లుండ నిమ్ము. తరువాత జరిగిన చిత్రకథ వినుము.

రంగా—మామా! నాచిత్తం బిప్పటికి స్థిమితపడినది. తరువాత సంగతి యేమి?

ధర్మా—నేను మరలి రాఁ దలంచునంతలో హైదరుజంగును విజయరామరాజును కొంతతురుష్క బలంబుతో వచ్చి నన్ను ముట్టడించి పట్టుకొనం దలంచినారు.

రంగా—హాహా! ఎంతపని చేసినారు దుర్మార్గులు!

వెంగ—

శా. హాహా! హైదరుజంగుశీర్షము కళిం ♦ గాధీశుశీర్షంబునన్
బాహాశక్తి నిశాతహేతివిలస ♦ ద్వైశ్వానరజ్వాలలన్

స్వాహాకారముగా గళోద్గళదస్ర ♦ గ్బహ్వ్యాజ్యధారాప్లుతిఁ
సాహంకారత వేల్వనైతిగద మా ♦ మా! రాజసూయంబుగన్.

ధర్మా—అంతలో నే నాముట్టడించినమూకలం జించి చెండాడి పట్టుపడక యిట్లు విన్నవింప వచ్చితిని మహారాజా ?

వెంగ—(సంభ్రమముతో) మామా ! రామరాజుంగూడఁ జంపి వచ్చితివా ?

ధర్మా—(దైన్యముఖముతో) లేదోయి నాయనా ! లేదోయి !

రంగ—మామా! నీవు మూకలఁ జించుకొనివచ్చునప్పుడు మొఱకు తురక యురకుండెనా ?

ధర్మా—వాఁ డురకుండునా! ఉరకుండినవి జయరాముఁ డురకుండ నిచ్చునా! నన్నుఁబట్టుకొను ప్రయత్నము విఫలంబయినప్పుడ కోటముట్ట డించి పట్టుకొనుఁ డని మూకల కాజ్ఞ యిచ్చె.

రంగా—మూసాబూసి నీతో మఱి యేమియుం బ్రసంగింపలేదా?

ధర్మా—ప్రసంగింప కేమి. కావలసినంత ప్రసంగించినాఁడు ప్రసంగించినదంతయు మనకుఁ బ్రతికూలమే “బిరుదునిషానీలు విడిచి విూరాజు సపుత్రమిత్రకళత్ర ముగాఁ గోటవిడిచిపోఁవలయో లేదేనివిజయరాముని కాళ్లుపట్టుకొని సంధి చేసికొనుటయో శ్రేయంబు కాదేని యుద్ధంబు సిద్ధంబు అందు విజయంబు మాకు సిద్ధాంతంబు” అని చెప్ప మనెను.

రంగా—అన్నా ! దుర్మార్గు డెంతమాట చెప్పినాఁడు! ఆఁడుబిడ్డలతోఁ గోట విడిచి పొమ్మనుటయే గాక విజయరాముని కాళ్ళమీఁదఁ గూడఁ బడు మనియెంగా ! హాహా ! కాలమహిమ ! (క్రోధముతో)

శా. యుద్ధంబుం బొనరించి బొబ్బిలిగడీ ♦ నస్తూంత లూగించినన్
వృద్ధస్త్రీశిశుపుత్రమిత్రధనధా ♦ న్యేష్టార్థముల్ వోయినన్
బద్ధుండైన నశించిపోయినను భా ♦ స్వద్రాజవంశోద్భవుం
డిద్ధస్పర్ధఁ దెగించుఁ గాని యితరా ♦ పేక్షం బ్రవర్తించునే.

అమాత్యవర్యా ! మన కింకఁ గర్తవ్య మేమి?

నర—యుద్ధమే కర్తవ్యము.

చె. వెం—(భయ మభినయించుచు) మహారాజ !

మ. నిశితకూర్పరగదాసితోమరశత ♦ ఘ్నిప్రాతసంభూత మై
దశదిగ్వ్యాప్తమహాసైన్యమేదురం ♦ దుర్ధ్యం బసాధ్యం బగుచ్
నశియించుం బ్రజ గోళ్ళఁ బోవ్రుపనికిన్ ♦ గాన్గాను గోడ్డళ్ళు ను
ద్దశ పాలొదుము కొన్నినాళ్ళు తల పొం ♦ దందాచుకో రాదొకో.

రంగా—వెంకయ్యా ! ఎంత వెఱ్ఱివాఁడవు ?

శా. నీచత్వంబున నత్కులీనుఁడు కడన్ ♦ జీవించుకంటెన్ నిజ
ప్రాచుర్యప్రతిభా విశేషమున ని ♦ శ్చల్యం బెన్న సద్ధతిగాఁ
బే చాలున్ యశము గడించుకొనినన్ ♦ వీరప్రతిష్ఠాఢ్యు లౌ
రేచర్లాన్వయజాతు లట్టిబ్రతు క ♦ ర్థి న్మెత్తురే? చత్తురే.

శా. నాసామే నన నొప్పు తాండ్రకులర ♦ త్నం బాత్మ నా నొప్పు నీ
నా సైదోడును వీర్యమైకధను లై ♦ న్నన్ పీరు జన్యంబునన్
గాసం తైన వెఱుంగు నూరనిమదిన్ ♦ గాలాచినన్ లానులన్
మూసాబూసికరాసుసైన్యము ల ను ♦ న్మూలింప రే పేల్మిడిన్.

గీ. ఉక్కు తునకలు గద మన ♦ యోధు లెల్లఁ
గఱకుతురకఫిరంగుల ♦ సరకుఁగొనరు
చిత్తజల్లుగ నాజిలో ♦ నెత్తి బడుతు
పాకిగుండ్లకు జంకరు ♦ పీఁక విడరు.

వెంకయ్యా ! మనవారి పరాక్రమంబు లిట్టివి. మానంబు వోయిన వెనుక మానధనులకుఁ బ్రాణంబు ప్రయోజనంబు కాదు గాన నీమాట యుక్తియుక్తంబు కాదని యెఱుంగుదువుగాక.

అందఱు—మేలు మేలు ! మహారాజ ! మేలు మేలు !

కంచుకి—(ప్రవేశించి) మహాదు మహారాజ ! ఎవఁడో యొక

హుశ్రిమావు హుమాయి నెక్కి వచ్చి హజారము వాకిట వేచియున్నాఁడు అతండీపత్రిక దేవరవారికిమ్మనినాకిచ్చిపుచ్చినాఁడు. (పత్రికనిచ్చును)

నర—[పుచ్చుకొనిచదివి] మహారాజ! హైదరుజంగువద్దనుండిహాసనల్లీఖానుఁడు వచ్చియున్నాఁడు.

రంగా—[ఉత్సాహముతో] వారిలో నతండు పరమోత్తముఁడు. అతండిపుడు వార్తాహరుండై మన కేదియో మేలువార్తం దెచ్చియున్నాఁడు. మీరెల్లరు వాని కెదుర్కోలుసేసి తీసికొనిరండు.

అందఱు—చిత్తము [అని నిష్క్రమించుచున్నారు]

[అంత నరసరాజాదులతో హాసనల్లీఖాన్ ప్రవేశించుచున్నాఁడు]

హాస—సలాంబందగాకేయాలీ!

రంగా—ఓహో! నాప్రియమిత్రుఁడు హాసనల్లీఖానుఁడా? రమ్ము. [పీఠముంజూపుచున్నాఁడు. అందఱు కూర్చుండురు]

రంగా—ఓహో! ప్రాణమిత్రమా! నరాక మాకు రాకయుంబోలె వీఁకం గూర్చుచున్నయది. ఏకారణంబున నిట వచ్చితివో విన ముచ్చట పడుచున్నారము.

హాస—మహారాజ్! నేఁ మీకీమొదిరీవస్తాఁ. నారాకామీకికోపం సేస్తాది. ఖుషీ సేయుదూవున్నదీ. జం. హమారావజీర్ సాహేబ్ బద్మాషు వున్నాడు. మీకీ మార్నేకు తయ్యారు వున్నాడు. విజయరాజాకీ మిలాఖత్ అయి లష్కర్కి సిద్ధం చేసి నాగోజీలగాయత్ మునిషీల్ఖోగల్సి బుస్సీ కచ్చేరి సేయుసమయంలో మీబురుజూల్మీద నౌబత్ బజాయింపూ యని హుకుం సెప్పినాడ్. ఆమునాసూపిలిసి, "రాపుల్ డంకా నగారాబిరుదూ నిసాన్సీల్ తో గడీ విడిచిపో లేద్! ఫౌకాపో తేలడాయికీ బడాయించీ వున్నాం" సెప్పాచున్నాడ్ దానికేవొచ్చినాఁ మహారాజ్!

రంగా—మిత్రమా! హైదరుజంగు మాపై నింతయాగ్రహించుట కేమికారణము? విజయరాముఁ డిచ్చిన లంచంబున కంతకంతగా మా వలనమాత్రము తీసికోరాదా?

శా. మా సాబూసియిదింత నేమెఱుఁగరా ♦ మా ధాత్మమాయాగతిన్
మోసం బాది యథాప్రవర్తనమునన్ ♦ బో లేక తాఁ దైలపి
ష్ఠాసక్తిన్ వెరు వొంటనంటుభవకం ♦ బల్గాపశుఘ్నాకృతిమై
వాసం జేసి మెలంగుచుండుఁ గలఁప ♦ వ్యాపారపారీణుఁడై.

మ. కలకాలంబుగ మా కనుశ్రితముగాఁ ♦ గన్పట్టు భేర్యాదులుం
డొలఁగం గొటనువీడిపొమ్మట యున్ ♦ దుర్మార్గుఁ డారాజు కా
ఖలు సేవించిమెలఁగు మంట యును నా ♦ లోచింప నాబూసికిన్
ఖలుఁ డాహైదరుజంగుసాహెబునకున్ ♦ గారాదు నానొప్పదే.

మిత్రమా! మే మీవలసిన దే కాక మఱియెంత పైక మిచ్చుకొమ్మనిన నిచ్చుకొందుము మఱియేమి చేయుమనినఁ జేయుదుము గాని యీ రెండును మాత్రము చేయువారము కాము. మాకు బలవద్విరోధంబు వచ్చి ప్రాణములు గోలుపో వలసివచ్చు నని భయం బిసుమంతయును లేదు. మాపలని నేర మింతయును లేదు దుష్టరాజప్రబోధనంబునవారు మాపై నెత్తివచ్చిన రానిమ్ము దైవమే దానికిఁ బ్రమాణము.

హాస — రాజా! మీంగ్ బహూమంచివార్ మీంకీతప్పూ లేద్ మీ బిరుదూనిపాసీల్ తీసివెయ్యాలా వార్కీ మంచీ కాద్ ఖాని ఖొంచం హాలొసవా సెయ్యవాలా వుంది. వారూ భలవంతుల్ బడాలమ్కర్ కలావార్ వారీకళహం మనకీను చీకాద్ మీంమంచీ వార్కీ జరూరు లేద్ హైదర్ రాజా మాటమీందా వున్నాడ్. వాడికి వ ఛూ కత్తి గొట్టీ బాసాసేశాడ్ వాడికీమాటా సెల్లాది నీకీమాటా సెల్లదూ వుంది. మనవీసేస్తాన్ మే దాదా! న్పెర్కనెలా బైటాపో మళ్ళీ నీకీరాజ్జం తెప్పిస్తాన్ మంసయం లేద్ నామాటాయినూ. ఖత్తిముట్టీసెస్తాన్. పిల్లల్కీ మేకల్కీ కాపాడ్కో వాలా రాజా! నామాటయిన్ నీకీ పార్దనా సేస్తాన్. నీకీ దండం పెడతాన్ విన్నూనూస్తే సాలాబెంగా వేస్తాదీ వున్నదీ కీ మేలూసేస్తాన్. నామాటాయిన్. నామాటాయిన్.

రంగా—ప్రాణమిత్రమా! నీకు మాపై మిక్కిలి దయగలదని నే నెఱుంగుదును. దానం జేసియే నీవింతగాఁ జెప్పుచుంటివి నీమాట వినకున్న మాకుఁ బ్రాణగొడ్డంబు వచ్చుటయే సిద్ధము. అయినను—

పంచ. పరంపరాగతాన్వవాయ ♦ పౌరుషాభిమానముల్
పరాపరాత్మగౌరవంబు ♦ ప్రాభవప్రశస్తియుఁ
జరామయాదులన్ నశించి ♦ సగ్గిపోవ నున్నయీ
శరీరమందు నాసఁ జేసి ♦ చంపుకోఁగ నాయమే.

ఎది యెట్లయినం గానిమ్ము దాని కింతయునం జింతింప వలసినపని లేదు. నీకు మాపైఁ బరిపూర్ణానుగ్రహమే యున్నయెడల వారడిగినంత సొమ్మిచ్చి వారిదర్శనమునకు వచ్చి యనురక్తిం బ్రవర్తించెద. ఇట్లు చెప్పి సంధి గావింపుము. కాదేని కానున్నది కాకమానదు. దీనికొండాడకుము. నావలనం దప్పున్నం జెప్పుము.

హాస—(విచారమునఁదలపంకించుచు) రాజా! సెప్పవాలా సెప్పినాఁ పైనా నీసిత్తము నేనూ సెయ్యాగలదీ సేస్తాఁ. మీదాథైథం వున్నాడ్. నాకూ సెలవు.

రంగా—నీమాట వినక నిరాకరించితి నని నాపై నాగ్రహింపకుము మమ్ముమాత్రము మఱచిపోకుము. పోయిరమ్ము.

హాస—సిత్తం. సిత్తం. (లేచి సలాము చేసి నిష్క్రమించుచున్నాఁడు)

అందఱు—(లేచి కొంచె మనుసరించుచున్నారు.)

చారుఁడు—(ప్రవేశించి) జయము జయము మహారాజా! శత్రుసైన్యం బంతయు యుద్ధమునకు సన్నద్ధమై యున్నది.

రంగా—ఎట్లు సన్నద్ధమైనది? ఎట్లున్నది?

చారు—మహారాజ! రథహస్తి పత్తితురగాదులతో వేన వేలు మహాసైన్యంబు భూమి యీనినట్లెల్లెడం దానయై నిండియుండె. అందుఁ దురుష్కసైన్యంబునకు లాడుఖానుని, పరాసుసైన్యంబునకు లాసుని, కళింగసైన్యంబునకు విజయరాముని, అధికారులం గావించిరి. వారెల్ల

రును శిరస్త్రాణకవచాదులం దొడిగి ముసలముద్గరకరవాలభిండివాలాదులును బిఱ్ఱగులుం దుపాకులును లోనగు నానావిధాయుధంబులం ధరించి యుద్ధపాండిత్యంబు మెఱయ మోహరించిరి. అమ్మొగ్గరంబున కగ్రభాగంబున లాడుఖానుండును, పిఱిందిదెస మహమ్మదుస్సేన్ మయూరులును, దక్షిణంబున జానూఖాన్ సిద్దిబిలాలులును. ఉత్తరమున హసనల్లీఖాన్ మునురల్లాఖానులును, పశ్చాద్భాగంబున ఛత్రపతి ప్రముఖ రజపుత్రసమేత పారసీక యవన బర్బర పుళింద పుల్కసాదులును మధ్యదేశంబున సమస్తకళింగసైన్యముతో విజయరామరాజును నిలువ నియమించి హైదరుజంగు మహాహుంకారంబునం బెద్దకోలాహలంబు సేయుచు నేఁగ్రక్కదల నెల్లసేనల నడపించుకొని మనబొబ్బిలి గడీ ముట్టడింప వచ్చుచున్నాఁడు.

రంగా——(అలక్ష్యాభినయించుచు) హా హా మాకోట ముట్టడింప నంత ప్రళయముగా వచ్చుచున్నాఁడా ?

శా. రానీ వేలకు వేలు దోమలబలెన్ ♦ రాసూపరాసుల నేఁ
గానీ తమ్ముఁడు గాని కన్ దెలియఁగా ♦ గాఁ జేయు లే నట్లు గ
న్గొన్ సీలోకమును, కాల రాసి జమునిం ♦ గూడంగ సంధింపమే
మానంబున్న మనుష్యుఁ డిట్టిలతి రా ♦ మన్నించునే ప్రాణమున్.

(అంతఁ దత్తరపాటుతో నొకభటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భటు——హాసాదు మహారాజ ! పరాసుసైన్యము వచ్చి మనకోట పైఁబడుచున్నది. నే నిపుడు హనుమంతుబురుజుమీఁద నుండగా సముద్రపు హోరుపలెఁ బెద్దచప్పుడు వినిపింప నిది యేమిరా యనిలేచి యుత్తరి చూచితిని. బాబూ ! భూమి యీనిన ట్లెక్కడఁ జూచిన నదియే కనుపించుచున్నది.

రంగా——సరే ! నీవుపోయి నీపనిలోనుండుము. ఓహో ప్రధాన యోధులార ! మంత్రివర్యులారా ! మనకింక మహాయుద్ధంబు సిద్ధంబయినది కదా !

మ. చిరకాలంబుననుండి మీరలు మముం ♦ సేవించి జీవించుచుం
టిరి మీతాతలు తండ్రులిట్లె మిగులన్ ♦ విశ్వాసపాత్రస్థితిన్
స్థిరకీర్తిం గడియించికొంచు దివికిన్ ♦ విచ్చేసి రాలంబు భీ
కరమైవచ్చె భయస్థులుండుదురె పెల్ ♦ కంజాజికిన్ భీరులై.

అందఱు—(ఏకకంఠ్యముగా) మే మెల్లఁ దెగించి యున్నవారము. చచ్చుటకునైన సంసిద్ధముగా నున్నవారము.

నర—మహారాజ!

శా. తాతల్ తండ్రులు మేనమామసుతులున్ ♦ దన్వంగులున్ మాభటుల్
మీ తిండిం దినుచుంటి మీమెయిగనన్ ♦ మీదేసుండి పోరునన్
మీతో పాటు సుఖంబొ దుఃఖమొ పడన్ ♦ సిద్ధంబుగానుంటి మా
హా! తీవ్రంబుగఁ జూచినన్ దెగెదుమే ♦ నాశించునే బేలయున్.

రాజా! బొబ్బిలిపురంబునం బుట్టినపిల్లకిని సెలకిఁ బేయుండు నని నీ చిన్నతికిని దలంపకుము. నీవారు నీకై స్వరును ప్రాణంబు లాశించి యున్నవారు కారు చచ్చుటకునైన సిద్ధంబుగా నున్న వారియుద్ధం బెంత? ఇట్టిచో నిట్లానతిచ్చుట ధర్మంబుగాదు. ఇంక నీవిచారంబుదక్కి కార్యంబు దెసవాఁడవు కమ్ము లెమ్ము.

రంగా—వీరాధివీరులారా! మీరెల్లరు నా ప్రాణబంధువు లనియుఁ బ్రాణంబులకుం దెగించి యున్నవా రనియు నే నెఱింగియుఁ గార్యాంతరవ్యగ్రహృదయుండ నగుటం జేసి యెఱుంగనివాఁడఁ బోలె నిట్లంటిని గాని వేఱొండుగాదు దీనికి మీ రింతయును జింతింపకుఁడు. నాపేరు గాని భారంబంతయు మీదియే ఈ పరాసుతురుష్కసైన్యంబు వచ్చి పడుచున్నది. లెండు కట్టాయితంబుగఁ డు.

శా. లా మాఖాను తురుష్కసైన్యములకున్ ♦ లాసూ పరాసీలకున్
బ్రోడల్ పోటులుగా నమర్పఁబడి కే ♦ పుం బ్రాపు దీపింపఁగా
నీడంబోవక వచ్చునాబలగమే ♦ తేడొప్పడం జేయువాఁ
డీడన్ మేల్దళవాయి గాసలుప గా ♦ దే మీకు మీసేనకున్.

ధర్మా—రాజా! ముంజేతికడియంబున కర్గ మేల?

ఉ. దండితవీరవైరిజన ♦ దర్పవిదారణదారుణాస్త్రిఁ డా
ఖండలశస్త్రతుల్యసద ♦ ఖండపరాక్రమవిక్రమాంధు మా
ర్తాండసదృక్షతీక్ష్ణకరుఁ ♦ డాహవదోహలమత్తచిత్తుఁ డీ
గండరగండ డైనయును ♦ గంటిన్న సింహము సింహ మీతఁడే.

అందఱు—(మేలు మేలని పలుకుచున్నారు.)

రంగా—క. మామా! సేనాపతిపై
మామానముగాచిపుచ్చు ♦ మా యిఁక మీఁదన్
మేమెల్ల నీదునుడిలో
నేమియు వర్తించుచుందు ♦ మీయుద్ధమునన్.

(మెడలోఁ బూలదండ నైవ అందఱు కరతాళధ్వనులను చేయుదురు.)

నర—రాజా! నే నా పదంబున కంతసమర్థుండను గాను. అయినను భారం బంతయు నాపైఁ బెట్టినారు. కావున దేవరయాజ్ఞానుసారం బునం జేత నైనంతవట్టు కార్యంబు దేసవాఁడనై ప్రవర్తించెదం గాక. (కలయం బరికించి) ఓహో! ప్రధానయోధులారా!

సీ. రేబవల్ విడకుండ ♦ నొంటిత్తు ప్రోగింపుఁ
డెల్లబలంబు లా ♦ యితము గందు
కోటకొమ్మల మీఁద ♦ మేటిసాధనములు
పాదుకొల్పుఁడు కత్తు ♦ లూఁది కొనుఁడు
ముందుగుండు తుపాకు ♦ లందందఁ నిల్పుఁడు
కాఁగఁ బెట్టుఁడు నూనె ♦ కాకఁ దేఱ
నలుగులు బల్లెము ♦ ల్లలి సానఁ బట్టుఁడు
విండ్లమ్ము లందుఁడు ♦ వేంకొలంది

గీ. కరుల హారులను గ్రైసేసి ♦ కడల నిల్పుఁ
దుష్టిములమీఁద సామగ్రు ♦ లుంచికొనుఁడు

పరిఘ నలుచక్కి దారుల ♦ భద్రపడుఁడు
బురుజుగము లెక్కి జోములు ♦ పోరుకొనుఁడు.

మఱియుం గాకర్లపూడి వేంకటరాజు పశ్చిమంబునను, చెలికాని వేంకయ యుత్తరంబునను, దామెర ధర్మారాయఁడు తూరుపునను, చెలికాని నరసయ్య దక్షిణంబునను వారివారి సేనలతో బురుజులెక్కి కోటను రక్షించుచుఁ బోరుచుండురుగాక. నేను నాయోపినంతవట్టు కోటచుట్టునుం జుట్టివచ్చుచుఁ బోరుచుందు.

రంగా — మంత్రివర్యా! మనము దండోపాయంబునకు మున్ను రెండుపాయంబులు మాత్రముపయోగించితిమి. మఱియు దృతీయో పాయబునుం బ్రయోగింపవలసినవిధి యున్నదా లేదా?

నర — రాజా! దానం బ్రయోజనం బిసుమంతయును లేదు. కాని దేవరచిత్తంబున కన్యథా బ్రవర్తించుట నాయిష్టంబుకాదు కావున మరల నొక్కరాయబారిం బుస్సికడ కనుపుటయే యుత్తమము.

రంగా — మామా! దానికి నీవుతక్క మఱి యెవ్వరు సమర్థులు? నీవేపోయి నేర్పునం బ్రవర్తించిరమ్ము.

వెంగ — క. అన్నా! క్రూరులు వారలు
ము న్నీధర్మానునీతి ♦ ముట్టక వెట్టన్
గన్నారఁ గనియు వినియున్
మిన్నక మఱి యితని నంప ♦ మేలే యటకున్.

నర — క. న న్నేమిసేయఁగలవా
రన్నరనాథుఁడును బుస్సి ♦ హైదరుజంగున్
దిన్నఁగ నాడక మఱియే
మన్నం దల లూడవేయ ♦ నా? తెగి వత్సా!

రంగా — అమాత్యశేఖరా! పరాసుసైన్యంబు వచ్చి కోట ముట్ట డించియున్నది. నీవు తక్షణము రావలయునని పాపరాయుని కొకజాబు వ్రాసి పంపుము.

నర—(తాళపత్రము లిఖించి) భటులారా! మీరు కూర గాయ లమ్ముకొనునట్టి స్త్రీల వేషము వేసికొని రొట్టెలనడుమ నీజాబు పెట్టి తురకలకుం గొరకకుండఁ దప్పించుకొని పోయి రాజాముకోటలోనున్న మనపాపారాయునికిండు. శీఘ్రపఁప్రవర్తించిరండుపొండు. (జాబిచ్చును)

భటు—చిత్తము. (జాబు గొని నిష్క్రమించుచున్నారు)

(తెరలో రణభేరి మ్రోగును.)

రంగా—(సంభ్రమముతో) వీరాగ్రేసరులారా! అదిగో రణభేరి మ్రోగుచున్నది. లెండు మీరెల్లరు యుద్ధసన్నద్ధులుకండు. నే నంతః పురాంగనల నూరార్చివచ్చెదను. (అని లేచుచున్నాఁడు.)

అందఱు—(లేచి నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

---

బిరానఁ గవిసిరి స్థిరామభావము ♦ పెంపుగఁ బోయెను రేలా
వరాలొసంగిదయ మొరాలకింపవు ♦ భారమొకోయెదు బాలా.

(కుమారుం జూపుచు)

ఉ. ఈసుపుత్రకుఁ డీకులము ♦ నింతటి కీర్తినిఁ గూర్మి నిప్పుడీ
మానుగ రాజ్య మేలుకొను ♦ మార్గమునం బ్రతికించి ప్రోవరా
దా నిను వేఁడుకొంటిని కృ ♦ తాంజలినై సకలంబు నాశనం
బైనను సంతసంబు సుజ ♦ నావనపాలక ! గోపబాలకా.

పురో—హా ! హా ! దేవీ ! యేమియిది ? నీకొమారు నొక్కరుని మాత్రము బ్రదికింపు మని యు. దక్కిన సకలంబు నాశనంబైనసంతసంబనియుఁ బలుకుచుంటివి ? ఏమి యీ దుర్లీలము? ఏమి యీ యమంగళము ? సర్వదా మనకు దైవము మేలు సేయుఁ గాక. పాపము శమించు గాక యమంగళ మడంగుఁ గాక.

మల్ల—హా ! హా! ఎంత పాప మెంత పాపము! మాకులమునంతకీయొక్క నిను వుండె ననియు, నమ్మ రాజ్యమేలుకొనునట్లు చేయు మనియు, సర్వవినాశకరోపద్రవంబు వచ్చెనది నమ్మశంబు కాదనియుఁ బలికిన నాపలుకు కల్లలంబుగాఁ బరిణమించినది. అయ్యో ! అయ్యో ! దైవము నానోట నెట్లుగాఁ బలికించినదో? ఏయమంగళము రానున్నదో హాహాహా !! [గుడిలోఁ బెద్దచక్కాను దీపము లారిపోవుచున్నవి.]

పురో—ఏమి యీ యమంగళము ! ఏమియీ యపశకునము! దేవీ! యేదో కీడు మూడఁదలఁచుకొనియే యున్నది.

గీ. కలుగఁ బోవుశుభాశుభ ♦ కర్మములను
నరుల కెఱిఁగించుటకు మున్న ♦ నలువ మీఱ
ఘనుఁడు సర్వజ్ఞుఁ డగుదేవుఁ ♦ డనుచునట్టి
దూత లనఁగను శకునముల్ ♦ దోఁచుచుండు.

మల్ల—హాహా ! దైవసంకల్పము ! హా ! పరమేశ్వరా ! గోపాలమూర్తియు నాపాటుఁ జూడ లేనివాఁడుంబలెఁ బశ్చాన్ముఖంబు పెట్టి

నట్టి నాకుఁ బొడకట్టుచున్న వాఁడు స్వామీ! ఏమి నాదురదృష్టము!

మ. ఖలులీవెల్లలు మీరి కైసను ఖలుల్ ♦ గన్పట్టరా దంచు నా
వలవంతం బడునాదు పంత విని సై ♦ పక తేనిచిత్తార్తినా
తొలగింపం బడరానిపీక యని బీ ♦ తుంగొంటు నా యిట్టి ల
వ్వలమోహంబిది యేమినాయము దయన్ ♦ బాలింపు గోపాలకా.

(కుడికన్నదరుటను సూచించి) హాహా! ఎట్టిదుశ్శకునములగుచున్నవి! ఏమిట్టివిపత్తువచ్చినది! ఇది రావుకులంబునకు వినాశ కాలంబువలెం దోఁచుచున్నది. హాహా! పరమేశ్వరా! (పడిమూర్ఛిల్లుచున్నది)

దాసి—(పొదివికొని శైత్యోపచారములు సేయుచు) తల్లీ! ఊఱడిల్లు మా అడిల్లుము నీవి ట్లల్లతల్లడంపడ నీకుమారుం డెట్లు డిల్లపోయి బిక్కచఱచి యున్నవాఁడో చూడుము ధీరస్వాంతవు నీకింతవలవంత తగదు. లెమ్ము సేదదేరి కార్యంబు దెసదానవు కమ్ము. నీప్రియుండు మహాబలపరాక్రమవంతుం డింతలో నీపరాసులనెల్లఁ బరాసులం జేసి నీకామోదం బాపాదింపఁ గలఁడు. ఉమ్మలింపకుము చిత్తవికారజమ్ములగు శకునమ్ములు విఫలమ్ములగు నమ్మ. చింతాజ్వరసంతప్తచిత్త వగు నీకిప్పుడన్నియు నపశకునములట్లె తోఁచుచున్నవి కానిమ్ము వీని కనేక శాంతికపౌష్టికవిధు లున్నవని పెద్దలు చెప్పుదురు బ్రాహ్మణసమారాధనంబు గావించి ప్రతిక్రియ చేసికొందము. కొందల మందకుము లెమ్ము కష్టసుఖంబు లెట్టివారికిని గావడకుండవు. (వింజామర వేయుచున్నది.)

మల్ల—(లబ్ధసంజ్ఞయై లేచి) అయ్యో! నాకెట్టిపాడ్మకల వచ్చినది. దైవమా! నే నేమిచేయుదునోయి!

చ. బలువుగఁ బుట్టి పుడు నలు ♦ పక వితజెందుచునుండ దానిపై
నిలువున మోదుగొట్టినటు ♦ నేఁ బెగడొందుచు గోపబాలునిన్
గొలువఁగ రానమంగళము ♦ కూడఁగ వచ్చెను దుర్నిమిత్తముల్
కలలును గీడు చెప్పి మదిఁ ♦ గాల్చుచునున్నవి కొల్లదైవమా.

దాసి—అమ్మా! కల యేమి? నీకు నిద్రయెక్కడ? పగటికలలు పాటింపవచ్చునా? అయినను వృత్తాంత మేమి?

మల్ల—నాకల నిక్కముల యనియే తోఁచుచున్నది. వినుము నే నిపుడు దుఃఖాక్రాంతచిత్తనై మూర్ఛఁబడి యుండ నాకంటికి కొక్కనల్లని పురుషుండు తాడిపొడుగునం బోడకత్తి పట్టియొ్య. అంతలో నాఘాతుకుండు నామంగళసూత్రంబు ద్రెంచి నామగనిం గట్టి పట్టుకొని పోవుటకుం బ్రయత్నించె.

[తెరలో] ఓరోరి! మహాపాతకవర్తి క్రూరాత్ముఁడా! ఎవఁడవుఁరా నీవు?

శా. నేనుండన్ ననుఁ గట్టి నాదుగరితన్ జే ♦ ముట్టి తత్కాంతసూ
త్రానూనప్రభ దూలఁ జేసి కపట ♦ వ్యాపారముం బొందితే
రా! నన్నున్ రిపుతూలకల్పపవనున్ ♦ రంగక్షమావల్లభున్
గానం జాలపురా ధరన్ బ్రదుకఁగాఁ ♦ గాంక్షింప వాదుర్మతీ.

శా. పాతాళంబున దూరినన్ మఱి నభో ♦ భాగంబునం బాకినన్
స్ఫీతాంభోనిధి దాఁగినన్ దెసలకు ♦ ద్వేగంబునై సేగినన్
భూతప్రేతపిశాచశాకినులతోఁ ♦ బోరాడఁగా మూఁగినన్
నీతల్లిం గతపుత్త్రఁ జేసెదను ని ♦ క్కి ద్రాసిశస్త్రంబునన్.

[అని చదువుచు మహాక్రోధమునఁ గత్తి ఝళిపించుచు రంగరాయు ప్ర॥]

రంగా—దేవీ! నిన్నుఁ గొట్టి నన్నుం గట్ట నెంచినదుష్టాత్ముఁ డేఁడి? వాని నీక్షణంబున నీకరవాలంబున కాహారంబుఁ గావించెదను.

మల్ల—హా! నాథా! సకలజగదేకవల్లభా! అనాథను నన్ను రక్షింపుము రక్షింపుము. (కాళ్ళమీఁదఁ బడుచున్నది.)

రంగా—(లేవనెత్తి యూఱార్చుచు) దేవీ! నిన్నుఁగొట్టి నన్నుంగట్ట నెంచిన దుష్టాత్ముఁ డేఁడీ? వానిఁ గరవాలంబున కాహారంబు గావించెదను.

మల్ల—(కంట నీరు వెట్టుచు) నాథా! నీ వుండ నిన్నుఁగట్టి నీప్రాణేశ్వరిం గొట్టువాఁ డెవ్వఁడు?

రంగా—ఎవ్వఁడును లేఁడా? లేనిచో నట్లేల పలవించితివి?

మల్ల—అది దుస్స్వప్నము మహారాజా!

రంగా—క. చేలా! యేలా యిటు దీ
నాలాపము లాడుచుంటి ♦ వకటా తగునే
జాలిం బడ రంగమహీ
పాలునిసతి వయ్యుఁ జింత ♦ పాలైతి గదే.

మల్ల—ప్రాణేశ్వరా! మన కన్నియు దుర్నిమిత్తములే తోఁచు చున్నయవి. దుర్జనులా వైరులతోఁ బోరు మాని సంధిం జేసికొని కులంబు రక్షింపు మోదాక్షిణ్యాబ్ధీ నీకు నమస్కారము.

రంగా—సంధి చేసికొన నెంతయో ప్రయత్నించితిని గాని యది పొసఁగినది కాదు. యుద్ధమే సిద్ధమైనది.

మల్ల—సంధివచనంబు లెట్లు నడచెను?

రంగా—"మీకేవలసిన పన్నంతయు నిచ్చుటయే కాక మఱి యెంత పైకమైన నిచ్చెదము మా పైఁ జాలిం బూని తొలంగి పొం డనినఁ బరాసుఁ బూసి రోసంబున నన్ను విజయరామునికాళ్ళం బడి ప్రార్థింపు" మని చెప్పినాఁడు దానికి నే నంగీకరింపలేను.

మల్ల—(చేతులు జోడించుకొని) జీవితేశ్వరా! దాసురాలిప్రార్థన లంగీకరింపుము కోపింపకుము.

చ. వయసునఁ బెద్దవాఁడు బల ♦ వంతుఁడు క్షత్రియుఁ డర్థవంతుఁడుర్
భయరహితుండు బుస్సిదొర ♦ ప్రాపకముం గలవాఁడు రామరా
జయునితోఁ గోరితేరి యిపు ♦ డా మన సఖ్యము చేసికొంటయే
నయము మనకొప్పుఁగాని జన ♦ నాయక! యొండొకఁడైన నొప్పునే.

గీ. దాసురాలిమాటఁ ♦ ద్రోసివేయక చిత్త
మందు నాగ్రహంబు ♦ నాఁగనీక
యాలుగోలు బాలు ♦ గోలు గాకుండఁ గాఁ
గులము నెల్లఁ బ్రోవఁ ♦ దలఁపు మీశ.

రంగా—(ఆగ్రహముతోఁ ద్రోసివైచి) ఛీ ఛీ! మూఢాత్మురాలా!

ఉ. ఏమని పేర్మితీపు గుణ ♦ హీనుఁడు రామనరేంద్రు కాళులన్
మేము కులాభిమానమును ♦ మీఱి, పరాక్రమ మ్మజగించి, సే
నామతిఁ జేరి మ్రొక్కఁ ఖలు ♦ పద్ధతిమై బ్రతుకంగఁ బాడియే
యీమెయినిచ్చకంటె నశి ♦ యించినఁ గూడదె పౌరుషంబునన్.

పరాక్రమైకజీవనులగు బొబ్బిలివారందఱును జంకక చావ సిద్ధంబుగా నున్నవారు. భయంబున నంతఃపురాంగన లెల్లరు బాలవృద్ధసమేతంబుగా నొండొకకడకుం బుత్తుము పోయి ప్రాణములు కాపాడుకొనుఁడు.

మల్ల—(గడగడ వడఁకుచు) ప్రాణేశ్వరా! స్త్రీచాపలమ్మునం జేసి చేలనై తెలియక కాని నాపలుకుల కలుకఁ జెందకుఁడు. సర్వలోకరక్షాదక్షులగు వీరపురుషులే పోవుచున్న మాకు మాత్రము మా ప్రాణంబులు రక్షణీయంబులా? నేనును పౌరుషాభిమానంబులు గలవెలమకడుపునం బుట్టితిని గాని పిఱికిపందను గాను. సహాయానుకూల సామంబునఁ గార్యసాధన మగునో యని పట్టుబట్టితిని గాని మఱియొండేమియుం గాదు. నా తప్పుఁ జైకొని కాచి రక్షింపుమని ప్రార్థించుచున్నదాన (పాదములపైఁ బడును.)

రంగా—ప్రాణేశ్వరీ! ఇప్పుడుగదా నీవు వీరపత్నివైతివి. వీరమాత వహించుకొను భాగ్యము నీకుఁ బట్టలేదు. దాని కెవ రేమి చేయఁగలరు? ఇంక నీ వంతరంగంబునఁ జింత దక్కి యుండుము. (కుమారుని గ్రుచ్చి కౌఁగిలించుకొని) నాయనా! చిరంజీవీ! నీవు—

చ. పెఱిఁగియుఁ బెద్దవాఁడ వయి ♦ విద్దెలు నేర్చి యుద్ధభూములన్
గఱికిరి శత్రులన్ నఱికి ♦ క్రాలఁగఁ జూచెడు భాగ్య మయ్యెనే
దొరకక పోయెఁగా కొడుక! ♦ నోముఫలం బిటు లుండెనక్కటా
నెఱిఁగలవాఁడవై కులము ♦ నీతిని దప్పకుమయ్య యెప్పుడున్.

(తెరలో పిరంగులు పేలును. అంతసంభ్రమమునఁ గంచుకి ప్ర॥)

కంచు—మహారాజ! మహాయుద్ధ మగుచున్నది.

రంగా—అప్పుడే యుద్ధమా? మనసేనాని వచ్చినాఁడా?

కంచు—మన మంత్రిపుంగవుం డానరసరాయఁడు రాయబారము కుదురమి జేసి యిప్పుడే వచ్చినాఁడు.

రంగా—నాకడకు రాని కారణ మేమి?

కంచు—అతండు వచ్చునప్పటికే వేనవేలు శత్రుసైన్యంబులు వచ్చి మనకోట చుట్టును ముట్టడించి పిరంగులుగాల్చియు తుపాలు పేల్చియు, బాణంబులు పఱపియు, కత్తుల మొత్తియు, నిచ్చెలం బొడిచియు, తోలు నిచ్చెనల వెంటఁ గోటపై కెగబ్రాకియు, మఱియు ననేకవిధోపాయం బుల మన నగరిం డీకొని ప్రాకరం బోరాడుచుండిరి. అదిచూచి తా నటు కదలి రా ననువుపడక పోయివచ్చినవృత్తాంత మంతయు నాతోఁ జెప్పి నన్ను నీకడ కనిచినాఁడు మహారాజ!

రంగా—అక్కడ నడచినరాయబార మేమి?

కంచు—నరసరాయఁ డొక్కింతసైన్యంబుతో బుస్సీకడకరిగి "మమ్ము రామరాజు కాళ్ళఁ బడుమనుటయు బొబ్బిలిని విడిచి పొమ్మనుటయు నీకుఁ దగదు. నీకుఁగావలసినంత సొమ్మిచ్చెదము. పరాక్రమైక జీవను లగుమాతోఁ గయ్యమునకుఁ గాలు ద్రువ్వుట మీకును విజయరామునకుం గీడున కాకరం బగు; మాపరాక్రమం బెట్టిదంటివేని వినుము. మున్ను తమ్ములగుంటయుద్ధములో లక్షసైన్యముతో గోపాలరాజును బలుసుపాటిమేటియుద్ధమున నేఁడువేలయేనూరు దండులో జగన్నాథరాజును బొబ్బిలిహరి నెదిరించి నాశనంబగుట జగద్విదితము.అది యటుండ నిమ్మెపు డీకలిపయజనంబుతో విజయరామరాజు నెదిరింపం జేసి మీరు తటస్థులై చూచుచుండుఁడు. మేము గెలిచిన విజయనగర రాజ్యము మాకును, ఆతఁడు గెలిచిన బొబ్బిలిరాజ్య మతనికి నిప్పింపుఁడు దుర్జాతి యైనరాజుమాట నమ్మి మీరు మాపైఁ గత్తిగట్టుట ధర్మంబు గాదు. ప్రాణము లాసింపక మేమున్న వారము పోరైనచో మీరు మరల మీదేశంబునకుఁ బోవుట లేదని తెలిసికొమ్ము" అనన

నతండు కోపించి హైదరుజంగుం జిలకించిన నతఁడు నరసరాయనిం బట్టె నెంచిన నతండు వారినెల్లం దునాతునియలు చేసి వచ్చి మనవారిం జేరి పోరుచున్నవాఁడు.

రంగా—హాహా! దుర్యోధనాదులు శ్రీకృష్ణుంగట్టనెంచినట్లు దుర్మార్గులు మన నరసరాయనింగూడఁ గట్టనెంచిరా? కానీ మన సేనాధీశ్వరుండు మంచిపనియే చేసి వచ్చినాఁడు. కంచుకీ! మనవా రెట్లు పోరుచున్నారు.

కంచు—మనవారెల్లరుకోటకొమ్మలెక్కి చెక్కుచెదరక చక్కనిలిచి నానావిధాయుధవిద్యావైశద్యం బంతయు నగపరచుచుండిరి. రాజా! మనయోధులమాట చెప్పనేల! మనదాసీజనంబునుం బురుజులెక్కి కోటలెగఁబ్రాకి వచ్చువారిపైఁ గాఁగిననూనె చల్లియు, జిగురంబళ్లు వోసియు, గండోపలంబులు జారవిడిచియు, చీపురుతాటియాకులం గొట్టి వారిందగులఁబెట్టియు జజాయీలం జిచ్చుబుడ్లు తారలుం జిమ్మియు మఱియు ననేకవిధంబులం బీరువోక పోరుచున్నవారు.

రంగా—ఆహా! మనపై దాసదాసీజనంబునకుఁగూడ నెంతవిశ్వాసమున్నది! సరే మనయోధు లేమి చేయుచున్నవారు?

కంచు—మనయోధు లెల్లరు నాయాస్థానంబుల నిలిచి ఘోరయుద్ధము చేయుచున్నవారు నారసింహుఁడు నపరనారసింహునివలెఁ జూడ నొప్పి యెల్లెడం దానయగుచు నవక్రపరాక్రమంబు నెఱపుచున్నవాఁడు. మఱియు మన పడాలరామన్నయు, ముత్యాలపాపయ్యయు బారుటీలతో వేయిమందిని మ్రదించినారు.

రంగా—బళిబళీ! వారు నాకు నమ్మినబంటులుకదా! కంచుకీ! మన వేంగళ్రాయఁ డెక్కడ? అతఁడు నాతమ్ముఁ డనిపరాసులకుం దెలిసెనా? లేదా?

కంచు—అతనిం బరాసులగుపరాసు లేమి తెలియఁగలరు? హైదరు ప్రముఖముఖ్యతురుష్కసైన్య మంతయు బాగుగా గుర్తించినది.

రంగా—(సంతోషముతో) ఏమిరా! నాతమ్ముఁడు పరాసులంబరాసులం జేసి తురుష్కులం దూలపుచ్చినాఁడా? మేలు మేలు తమ్ముఁడా? మేలు మేలు. (తెరలోఁ గలకలము ఫిరంగులు ప్రేలును)

రంగా—(ఆకర్ణించి) ఓహో మహాసంగ్రామ మగుచున్నది. శత్రులుక్కుమిగిలినట్లు వినవచ్చుచున్నది. నే నిటనుండ మనం బొప్పక వేగిరించుచున్నది. దేవీ! నే నిదె సమరంబునకుఁ బోవుచున్నాఁడను నీవిట బ్రాహ్మణారాధనంబు గావించి యుక్తప్రకారంబునం బ్రవర్తింపుము. మానమును గాపాడుకొనుము.

వల్ల—(తలవంచి కన్నీరు విడుచుచు) హా! నాథా!

మ. ఇక నీజన్మమునందు నిన్ గనట లే ♦ దీపే దర్శ వెంశి యిం
కొకలోకంబున నెప్పుడో కలుగు న ♦ య్యో జీవితేశా! మొగం
బొకమాఱెట్టులు జూపు మీకనులతో ♦ నొప్పైననీరూపు చూ
చి కడుంబొందిక సంకమందునిలువన్ ♦ జింతింతు నశ్రాంతమున్.

క. సతతము నీరూపము నే మతిఁ దలఁచుచు మరణవేళ ♦ మఱువన యేనిన్
గతిగలదునిక్కఁ బొందఁగనతికరుణన్ మోము చూపి ♦ యరుగుము నాథా

రంగా—(చేయిపట్టుకొని) కాంతా! నీకింత సంతాపము చెల్లదు. ఎంతవారికిని జా వెప్పటికేని దప్పనిదియే వినుము.

మ. పురుకుత్సప్రభృతుల్ ధరాతలము సం ♦ పూర్ణప్రభావంబునన్
బరిపాలించి యొడల్ త్యజించి దివముం ♦ బాలింపఁగా నేగి రొ
క్కరుఁడున్ శాశ్వతవిష్ణుకల్పకముగాఁ ♦ గన్పట్టిరే నేలపై
వరకీర్తింజనువారు చచ్చియును జా ♦ వంబోవ రెప్పట్టునన్.

అజ్ఞానురాలివయి నీవు దేవకిని జింతింపకుము. ఎదియెట్లు కానున్నదో యది యట్లు కాకమానదు. మనము చేయఁగలది యింతయును లేదు. సర్వమును బురాకృతంబునం గలుగుచుండు. కావున నీవు దేవ్వరించుచుం గాలంబు వ్యర్థ సేయక పరంబు విచారించుకొమ్ము. పోయివచ్చెద ననుజ్ఞ యిమ్ము. (నిష్క్రమించుచున్నాఁడు)

మల్ల — హా హా! మహారాజెంత ధైర్యవంతుఁడు. అంతబలంబువచ్చి పడిన నావంతయైన వంతం బడక శాంతించబడి యున్నవాఁడు! మంద బుద్ధినగు నేను అజ్ఞానంబునం జేసి తుచ్ఛంబయిన ప్రాపంచికసుఖంబపేక్షించి మహారాజుమదిం గలంగించితి నాహా! ఎంతధైర్య! మెంత సాహస! మెంతశౌర్యము! పురుషులన్న రాఘవరే పురుషులుగాని తక్కిన వారిం జెప్పవలయునా? (పురోహితుం జూచి) భట్టారకా! నీవు పోయి శాంతికపౌష్టిక విధులం దీర్పుము.

పురో — చిత్తము దేవిగారి యాజ్ఞ. (నిష్క్రమించుచున్నాఁడు)

మల్ల — చేటీ! విజయరామరాజుగారియొద్దకు పంచిన కంపకిరాలే దేమికారణమో? ఆయన నాసందేశమున మనలననుగ్రహించునని యె నానమ్మకము.

దాసి — అమ్మా! దుర్మార్గుఁడాతఁడు, నాకుమాత్రము నమ్మకము లేదు. అయినను సందేశ మే మని?

మల్ల — వినుము.

శా. నాకుం దండ్రివి నీవు నీసుతను నే ♦ నాకష్టసౌఖ్యంబులన్
నీకు న్యాయాన మెప్పఁ గావునను దం ♦ డ్రీ నన్ను మన్నింపవే
లోకు ల్గాథలు వారికెన్నుజనముల్ ♦ లోడింపఁగా నొప్పనే
నాకంఠంగుంకుము బొట్టునిల్పికరుణన్ ♦ రక్షింప నేమ్రొక్కెదన్.

అని నే నంపినసందేశము. విజయరామరాజు పిల్లలు గన్నవాఁడుకాని గొడ్డువాడు కాఁడు. నాదీనాలాపము లాలించి నన్ను మన్నింపపోఁడు.

దాసి — దేవి —! దేవర యీసందేశమువిన్నచోఁ బ్రియాదమే వచ్చును.

మల్ల — వేంకటలక్ష్మీ! తల్లి లేనియీపిల్లవానిభారమునీదియేసుమీ.

దాసి — అమ్మా! నీవిట్లనకుము. నీమగండు సకల శత్రుక్షయంబు చేసి నిష్కంటకముగా రాజ్య మేల గలఁడు విచారింపకుము.

కుమా—అమ్మా! నాకు బుల్లికత్తిత్తే వాళ్లందర్నీ కొత్తి కొత్తి సంపొత్తాను. లచ్చిమీ! నన్నెత్తుకుపో. అమ్మా! యేవపకే యేదవకే. భయ్యంలే దప్పా దొత్తాను. (అని లేచుచున్నాఁడు)

మల్ల—(కొడుకుం బొదువుకొని ముద్దు వెట్టుకొనుచున్నది)

దాసి—అమ్మా! పులిపిల్ల పులిపిల్లయేగాని పిల్లిపిల్లయగునా? రంగరాయమహారాజచంద్రునకుఁ బుట్టిన నీని కిట్లు తగును సుమీ!

కంచు—(ప్రవేశించి) జయము జయము. మహారాజ్ఞీ! నేను విజయరామరాజునొద్దకు సందేశహరుఁడనయి పోయివచ్చియున్నాఁడను.

మల్ల—ఏమివృత్తాంతము?

కంచు—నీజాబు చూచి తా నిట్లు వ్రాసియిచ్చినాఁడు.

మల్ల—దాని విప్పి నీవే చదువుము వినియెదను.

కంచు—(విప్పి చదువుచున్నాఁడు.)

శా. నాకుంగూఁతురువంటిదాన వయినన్ ♦ రాజన్యధర్మాబ్ధిన్
జేకొంచున్ వధియింపవలెన్ విధి యిటుల్ ♦ నీనాథుఁ జంపెన్
నీకే నిచ్చెదఁ గొన్నియూళ్లు భృతికిన్ ♦ నీతాల్మి బోట్లాడఁగా
లేకున్నందుల కాత్మఁ గుందకుము తల్లీ! ♦ మల్లమాంబా సతీ.

మల్ల—(కన్నీరువడి) అన్నా! అన్నా! అన్నా! దుర్మార్గుఁ డిట్లు వ్రాసినాఁడు! జాలిపడి నే నిట్లు జాలిగా వ్రాసిన, నానాథునిం జంపి నాకుఁ గొన్నియూళ్లు భరణమిచ్చునఁట! హాహా! ఎంతదౌష్ట్యము! ఎంత పాపము! హాహా! మహాపాత్ముఁడా! క్రూరుఁడా! ఇట్లువ్రాయుటకు నీచే యెట్లాడెను రా? కఠినాత్మా! నావ్రాతకు న్యాయముననంగ అగునుగాని నీచిత్తమెంత కఠినమో కానంతయునం గఱగ లేదురా గురుద్రోహీ! నాకెట్టి యుత్తర మిచ్చితివిరా? పాపీ! చండాల! నీది పిల్లలం గన్న కడుపుకాదురా? మూఢా! (లేచి దుఃఖముతో చేతులు జోడించుకొని)

ఉ. ఏను మహాపతివ్రతన ♦ యేని బరార్తిని గోరనేని నా
మానస మెప్పుడున్ సుకృత ♦ మార్గమునందె మెలఁగునేని కన్

గానక భర్తఁ జంపి భర ♦ ణంబు నొసంగెద నన్నదుష్ట భూ
జానికులంబు నష్ట మగు ♦ సంతత కష్టము లంది కుందుచున్.

మఱియు నన్నిట్టుడికించినవాఁడును వానిం బురస్కరించుకొని పాపంబున కొడిగట్టిన హైదరజంగును నేఁటికి మూఁడవనాఁడు దుర్మరణంబు నొందుదురుగాక. వర్తకము పేర నీదేశమునం జొచ్చి మహారాజకులం బెల్ల మాయించి పరాక్రమంబున నాక్రమించుటయ కాక మమ్ము నున్మూలింపనెంచిన పరాసుల కిటఁ బాలనాధికారంబు పటాపంచ లగుంగాక. (అసిభూమిం గొట్టుచున్నది)

కుమా—(తల్లిం బొదివికొని) అమ్మా! మా బాబియ్యగారితో కూడా వెల్లి వాన్ని పొడిచొత్తా. అమ్మా! యేడవకే. యేడవకే.

మల్ల—(కుమారునిశిరము పుణుకుచు) నాయనా మీనాయన గారికి నీవు తోడుపడు భాగ్యము పట్టలేదోయి! మందభాగ్యులము మేము నీయానందమనుభవింప నోచుకోలేదు తండ్రీ! మేమెట్లయిన నీవు చిరంజీవివయి బొబ్బిలిం బరిపాలించుచుఁ గులం బుద్ధరింపుమా మాయన్నా! నిన్నయినఁ బ్రతికించుకొను మార్గము తోఁపక త్రొక్కిళ్లు పడుచున్నదాన నోయి బిడ్డా! (జ్ఞాపక మభినయించి) వేంకటలక్ష్మీ!

గీ. నాకుఁ బరమోపకారము ♦ లోక మెన్న
నట్లు చేయుఁగవలసిన ♦ యదను వచ్చె
నిపుడు నీ వది చేసిన ♦ గృపను జూతొ
కాక కాదందువో కాని ♦ కమలపాణి.

దాసి—అమ్మా! యిదియేమి? నన్నింతగా స్తుతించుచుంటివి? నీదాసదాసీజనంబు ప్రాణములయిన సమర్పించుటకు సంసిద్ధముగా నున్నదిసుమీ! సంశయింపకుము. నేఁ జేయనగున దేమో చెప్పుము.

మల్ల—ఓసీ! వేంకటలక్ష్మీ! ఇమ్మహాయుద్ధంబున రావువారెల్లం దెగుట సిద్ధంబు. ఆసందర్భమున నంతఃపురాంగనలకును మరణంబు సిద్ధాంతంబు. కావున వంశవృక్షాంకురం బగు నిక్కుమారు నేను లేని నీవు రక్షింపవలయునని నిన్నిట్లు ప్రార్థించుచున్నదాన.

దాసి—దేవీ! నన్నుఁ బ్రేమించి పెంచుచున్న రాణివాసమే పోయిన నేను మాత్ర మీపాపశరీరమును గాపాడుకొనుచుండఁ గలనా? అట్లు గాక కుమారుం బ్రదికించు మార్గ మున్నం జెప్పు మట్లు చేసెదను.

మల్ల—సామర్లకోటలో నా చెల్లెలు జగ్గయ్యదేవి యున్నది కదా? అటకీ బాలునిం గొనిపోయి విడిచి రమ్ము.

దాసి—అయ్యో! కోట చుట్టును శత్రులు ముట్టడించియున్నవారు వారిం దప్పించుకొని నే నీకుమారు నెట్లు సామర్లకోటం జేర్పఁగలను?

మల్ల—వీనికి బ్రాహ్మణకుమార వేషంబు వేసి తీసికొనిపొమ్ము నీ కీకంచుకియుఁ దోడు వచ్చును.

దాసి—చిత్తము. దేవిగారి యాజ్ఞ.

కుమా—ఊఁ! ఊఁ! ఊఁ! ఊఁ! నేను సామర్లకోట వెద్దను. యుద్ధానికి వెళ్తాను ఊఁ! ఊఁ! ఊఁ! ఊఁ! (మూలుగుచు గారాబము చేయును)

మల్ల—(కుమారుం బొదివికొని దుఃఖించుచు) నాయనా! చినవేంకటరాయా! నీవు సామర్లకోటకీ దాసీలతోఁ వెళ్లుము. తండ్రీ! అక్కడ నిన్నుఁ బ్రేమించు నీపినతల్లి యున్నది. నీయన్నదమ్ములక్కచెల్లెండ్రు నున్నారు. వారితో నీవు నాడుకొనుచుఁ బాడుకొనుచు సుఖముగాఁ గొన్నినాళ్లుండ వచ్చును దండ్రీ! మఱియు నా సామర్లకోటలో—

సీ—వన్నెచిన్నెల కోడ ♦ వన్నె కెక్కినగురాల్,

గున్నయేనుంగులు ♦ నెన్నొ గలవు

పొన్నకత్తులవాడు ♦ పిన్నవస్తాములు,

సాములగరిడీలు ♦ చాల గలవు

కన్నుల పండువై ♦ కమలముల్ వికసింప,

వెలయు కేళాకుళుల్ ♦ పెక్కు గలవు

చిలుకలు గోరువం ♦ కలు వల్కగను లవం,

దగు సేయు నుపవనుల్ ♦ మిగులఁ గలవు

చ. అవదలు జేలలుర్ నిరప ♦ రాధులు సాధుశ్రులుర్ బతివ్రతల్
వనితలు వారిఁ జంపుమని ♦ వ్రాసెను నానుదుర్ విఖ్యాతలోఁ
గనికరమింతలేక, తను ♦ గానక తోఁటిభవంబులందు నేఁ
బొనరిచినట్టిపాతకము ♦ పొంయితి దీనికి నేరుదిక్కెయో!

మల్ల — బాబయ్యా! యేమి యీవెఱ్ఱితనము?

చ. తెలియుఁగ నెంతవారు నిలఁ ♦ బ్రేల్వరి కాని యొకండు మిత్తికి
న్నలమసిఁ బ్రామిపొల్చుటక ♦ నుంగొని యేవిధియేయెటుంగమీ
పొలిసెడునంతయుర్ వినియు ♦ బూమెలెటేంగియు నట్టిగట్టియు
త్యేలలిటులూఁగుచుందుమని ♦ యెంచుటవెఱ్ఱితనంబ కాదొకో.

కావున నీవెందులకును గొందలంబందకుము నీ వెందులకువచ్చితివో చెప్పుము. రాజకార్యనిర్వాహకుండవు కమ్మ

వెంక — అమ్మా! మహారాజకర్తనిచ్చి నన్నంతఃపురమునకుఁబొమ్మని యాజ్ఞాపించినాఁడువచ్చినపనిని నివేదించుటకునాకునోరురాక పరితపించుచున్నవాఁడ నమ్మా!

మల్ల — అయ్యా! నీవు వచ్చినపని నాకుఁ దెలియును. దానికి నీవు చింతింపనక్కరలేదు. తొల్లి యల్లాయుద్దీను చిత్తూరుకోట ముట్టడించి నప్పుడు పద్మినీప్రముఖరాజపుత్రస్త్రీ లెల్లరును మానభంగమగునని చిచ్చునం బడి చచ్చి ప్రఖ్యాతి నందరే! మాకునట్టిఖ్యాతియేరాఁదలంచుకొనియున్నది.

వెంక — అమ్మా! నాకుఁ జేతులాడకున్నవి నేనెట్లు రాజాజ్ఞందీర్పఁగలవాఁడనో తెలియకున్నది. తల్లీ!

మల్ల — చేతు లాడకున్నవి కాళ్ళాడకున్న నన్న మాటలం కట్టిపెట్టుము. కార్యంబు దెసవాడవు గమ్ము. నాకామహారాజుకర్తనిటు తెమ్ము. నీవు లోనగరికరిగిరాజాజ్ఞనెఱవేర్పుము[కర్తింబుచ్చుకొనుచును]

వెంక—హాహా! పరమేశ్వరా! స్త్రీవధాపాతకంబున నన్నుంబడవైచితివిరా! హాహాహా! [అని లోపలికిఁ బోవుచున్నాఁడు]

మల్ల—[కత్తికి నమస్కరించి]

మ. కలనైనం గలుషక్రియావిముఖులై ♦ గన్పట్టు ధర్మస్వరూ
పులచేఁ దేజమునొంది నీవు జగముల్ ♦ బ్రోవంగ నెల్లప్పుడున్
ఖలులం దున్మెడువాన వేనిఁ ద్రుటిలో ♦ నాకంఠముం ద్రుంచి నన్
గలియుగ్ గూరిచి జీవితేశుపదముం ♦ గావంగ దేశ త్ర్రమా.

[కత్తియెత్తుచున్నది—తెర పడుచున్నది]

ఇది చతుర్థాంకము.

---

శ్రీ

# బొబ్బిలి యుద్ధ నాటకము.

## పంచమాంకము.

---

(స్థలము యుద్ధభూమిలోని డేరా)

(అంత దుబాసి లక్ష్మన్నతో నాశినుండగు బుస్సీ ప్రవేశించుచున్నాడు.)

బుస్సీ—లక్ష్మన్నా! యుద్ధవిశేషము లేమి? మనవారు గెల్లుపోరు చున్నారు?

లక్ష్మ—దేవా! లాడూఖాన్ పురస్సరంబుగా మన సైన్యంబంతయుఁ గోటలోనికిం ప్రవేశించుట కనేక సాధనోపాయంబులం బ్రవర్తింప జేసి జెట్టికిం జీమలు మూఁగినట్లు చుట్టును మూగికొట్టుడించిరి. అప్పుడు కోటలోని దాదు వెల్లరును బురుజు లెక్కి నూనె గాచి పోసియు, రాళ్లు ఉర్వియు, నగ్నిబాణంబు లేసియు, సీసంబుం బోసినియుఁ, గత్తుల మొత్తియుఁ, బోరి మనవారి నోర్లఁ బో జేసిరి. అంత లాడూఖాను మూపా కిగుండ్లకుం జాతిక వస్త్రమెక్కి పెనఁగఁ జొచ్చె.

[తెరలోఁ బెద్దకలకలము]

బుస్సీ—లక్ష్మనా. ఆ హాహాకారం బేమి?

లక్ష్మ—(కరికించి) పరాసువంశశేఖరా! మహోపద్రవము నప్పెనది. లాడూఖాను కోటపై కెక్కి పోరాడుచుండ వీరుండొక్కఁ డుడుకున్న నాతనిం దుపాకివాతం బెట్టిన నతం "డల్లానబీ" యని క్రిందికి బిల్లమిరంబు వేసి కూలినాఁడు.

బుస్సీ—హా హా హా! ఎంతపని జరిగినది. లాడుఖానెంతపొరబాటు చేసినాఁడు! తాను సేనానాయకుండై యుండి కోటయెక్కుటకు సాహ

సింపవచ్చునా ? ఆహా ! బొబ్బిలివారెంతశూరులు ! ఎంతధీరులు! వారితో వైరము వలదన్న నామాట హైదరు వినక పోయెదనుగదా ! అయ్యో ! సేనాని పోయిన సేన లెట్లు పరువులుచున్నవో కదా ?

లక్ష్మ—హాహాకారములు సేయుచు మనసైన్య మంతయుం జెల్లాచెదరై పాఱినం గాంచి హైదరు జాగు చేయ నెత్తిపిలిచి లాసూఖాన్ ప్రముఖులం బురికొల్పె. వారు నతని నిందింపకొనుచుం దెగించి కోటపై నోట జేరి పడిరి. పూసపాటి రాజు తనదళములతో వారికిందోడుపడియె అప్పుడు బొబ్బిలి యోధవరులు మహాధైర్యంబున నాయోధనంబు చేసి వారిం దగ్గఱఁ దరిమి రని తెలియవచ్చినది.

బుస్సీ—అరెరే ! మూంలాసూ వెక్కిగి పాఱినాఁడా ? హాహా ! వీరవరులార! గంగరాజప్రధానయోధులార ! మీరెంతపరాక్రమవంతులు!

లక్ష్మ—ఇదియంతయుం గనుచున్న హైదరు—

శా. లాషామూహాలెను లాసుఖుఖ్యులు గజిన్ ♦ లావేది విన్నిచ్చితా
రూడంబాడిరి సర్వదేశములను ♦ న్నోడించునాపేరునుం
బాడైపోయె నికేమి చేయుదును నా ♦ వారెన్నఁగా వేసవే
లాపేన్ స్వల్పము వారిగెల్చుట యుఁగ ♦ ష్టాసాధ్యమయ్యెంగటా.

అని చింతాక్రాంతచిత్తుండై తత్తరంపడుచు సేనకాజ్ఞాపించె. అప్పుడు షుకరుల్లాఖాన్, నాసరల్లీఖాన్, సిద్దిబిలాల్, లాసూఖాన్, మొదలగు తురుష్కయోధులును ఛత్రపతి రామచంద్ర ప్రభృతులతో విజయరామయజున బుజ్జగించి తమతమ సేనలతో నగ్గడించుచు ముట్టడించిరి మహాప్రభూ ! [తెరలో కలకలము.]

బుస్సీ—సందడియగుచున్న దది యేమి ? చూచెదము.

లక్ష్మ—(కిటికె తెరచిచూచి) హైదరుజంగును విజయరామరాజు నొకరినో యిద్దరినో వారిం బట్టి యిటకుఁ దెచ్చుచున్నారు.

బుస్సీ—ఎవరువారు ? వారిం బట్టి తెచ్చుటకుఁ గారణమేమి? సరే విచారింతముగాక. [అంతస్త్రీవేషధరులగు భటులిరువురు,దక్షిణవారున్ ప్ర॥[

విజ—(సేలాముచేసి) పారాసువంశాగ్రగణీ! (భటులంజూపుచు) వీరిద్దఱును బొబ్బిలిదుర్గంబునుండి వచ్చు కుండ నాకార వ్యాకార రాదులం బట్టి మా కనుమానంబు పుట్టి వీరి నిటు పట్టి తెచ్చితిమి.

హైద—వీళ్ళూ బద్మాషుల్ వున్నారు. వీళ్ళకీ తగినాసిచ్చా సేయువాలావుందీ సర్కార్!

బుస్సీ—(పరికించి తలయూచి) మీ రెవరు? ఎందుండువారు? ఇట కెందునిమిత్తము వచ్చినారు?

భటు—అయ్యోయ్యా! మేముఆడంగులం. మాది బొ—కాదు గొల్లపల్లి కూర లమ్ముకో వొచ్చి మోతున్నాం బాబు!

బుస్సీ—ఇంత దండువచ్చి చుట్టును ముట్టడించి యున్నది. మీరు భయములేక లోని కేదారిని వెళ్ళినారు?

భటు—బాబు! మాకు దండు బయ్యా మే టాడి మ మ్మేమిసేస్తది? మురటిదారిని కోటలో కెళ్ళొచ్చినాం సామి!

బుస్సీ—మీరు తాండ్రపాపయ్య నెఱుంగుదురా?

భటు—తెల్లోరి లేస్తేలచ్చాపదకొండుమాట్లొచ్చేవోళ్లం పాయ్యోవోళ్ళు మాకు తెల్దా బాబూ! తెల్సు.

బుస్సీ—అతఁ డిపుడెక్కడ నున్నాఁడు? ఏమి చేయుచున్నాఁడు?

భటు—దొరగోరు! ఆదొరగోరు కోట్లోనే వున్నారండి యుద్దప్పయత్తం సేస్తున్నారు. బాబో! సెప్పలేమ్. ఆఁత్తులేయ్. దు పాకులేయ్. లచ్చల్లచ్చలే మోగుసేశారు బాబు!

బుస్సీ—(భయముతోఁ దనలో) పాపారాయఁడుకోటలోనున్నచో నింక మనపని సున్నయే. కానీ విచారించెదం గాక. [ప్రకాశముగా] ఇంతసేనతోనతఁడుపోరుటకుఁబ్రయత్నించుచున్నాఁడా? ఎట్లు పోరఁగలడు?

భటు—ఆరికి బయ్యమేం బాబూ! సేనగత్తిమట్టోరండే మీపిరంగీలు గిరంగీలు దుక్కుతుక్కయి మొగ్గిమోతాయి నాసామిఁ రంగా!

విజ—పాహారాయనికిఁ బిరంగు లన్న భయమే లేదా! దాని కేమి గాని అతఁ డిప్పుడు రాజాములోనుండఁ గోటలో నున్నాఁడందు రేమి?

హైద—వీళ్ళూ దొంగల్మాటా సేస్తాదీ వుంది. వీళ్ళకీ తఃఖీ సెయ్యోవాలా, హజూర్!

బుస్సీ—మీమాటలు మాకుఁ సందేహములుగా నున్నవి. మిమ్ముఁ బరీక్షించెదను.

భటు—అమ్మొకో వచ్చినోళ్ళం మమ్మెందుకండి పరీచ్ఛ? మాకడేటు దండి?

బుస్సీ—లేకున్నచో మీకుఁ భయము లేదు. మిమ్ము విడిచిపెట్టెదము మీయాముస్తులు వస్తువులును జూపుఁడు

భటు—(భయమునొందు నౌకరి నౌకరు చూచుకొనుచున్నారు.)

విజ—ఏమి సంశయించుచున్నారు? మీరు కూర లమ్మవచ్చిన వారేని మీ కీభయ మేల?

హై—మీకీ పరిచ్ఛ సేస్తాం వోయ్. తిన్గా సూపూ లేకాపోతే తలా పోతాదీ మీకీ ఖబడ్దార్. (పట్టుకొనఁబోవుచున్నాఁడు.)

భటు—అయ్యో! సాయేబయ్యా! నీకు సలాం. ఆడోళ్ళంమాట్టుకోకు బాబు! తప్పుబాబు! అన్నీ సూపుతాం సూడు బాబు! (తట్టలు నేలఁ బడవైచి రొట్టెలు మొదలైనవి వెద జిమ్ముచున్నారు.)

బుస్సి—(పరికించి) వీరిబట్టలలో నేమున్నదో కాని తట్టలలో నేమియు లేదు. వీరు నిజముగాఁ గూర లమ్ముకోవచ్చినవారే యని నాయభిప్రాయము.

హైద—వీళ్ళూ దొంగల్వున్నార్. వీళ్ళకీబట్టల్ తనిక్కీసేసీ నమ్మవాలావుందిలే గాపోతే సఫాయిసెయ్యవాలావుంది. (బట్టలాగఁబోవును)

భటు—ఆకంగులం బాబో! ముట్టుకోకు బాబో! తప్పుబాబో! తప్పుబాబో! (అటునిటుఁ బరుగు లెత్తుచున్నారు.)

హై—అరే బద్మాష్ ! తమాషా కర్తేహే తూ !

(కొప్పుఁబట్టి లాగుచున్నాఁడు. అది యూడి చేతిలోనికి వచ్చుచున్నది.)

హైద—క్యారేభాయ్ ! మొగదీ వున్నదీ ?

(కట్టుకొంగుఁబట్టియూడలాగఁగా చడ్డీతోఁ బురుషుఁడు కనుపించును.)

విజ—(రెండవవాని నట్లు చేయుచున్నాఁడు.)

భటు—(మొలకు నొడ్డాణముగాఁ జుట్టుకొన్న కత్తులుతీసి త్రిప్పుచు) మేము రంగారాయని ప్రధానభటులము. స్త్రీలముకాము. పౌరుషము గల పురుషులము. పురుషులైనవారు రండు మమ్మెదిరింపుఁడు.

అందఱు—(కత్తులు త్రిప్పుచుఁ దెరచాటునకుఁ బోవుదురు.)

బుస్సి—లక్ష్మన్నా ! ఏమి యీమహాయుద్ధము ! ఇద్దఱితో నింత మంది పోరఁజాలకున్నవారు? వీరు వీరపురుషులుగాని సామన్యులుగారు హాహా ! యేమి వీరికరలాఘవము ! మండలాకారపరిభ్రమణంబున వీరి కత్తులెన్ని కుత్తుకలు తీసినవి ! (తెరలోఁ దుపాకులు పేలుచున్నవి.)

బుస్సి—లక్ష్మనా ! బొబ్బిలిభటులు కూలి రున్నారు పరికింపుము

లక్ష్మ—ఉచితము. దేవా గోళ్ళఁబోవ్రదానికి మనకు గొడ్డళ్లు పట్ట వలసి వచ్చుచున్నది.

అందఱు—(ప్రవేశించుచున్నారు.)

బుస్సి—ఆడవేషము వేసికొనివచ్చిన సామాన్యులిద్దఱేయిట్టిబీరంబు చూపిరి. వీరి మించినవారెందఱుందురో ? వారిం జయించుట మనకసాధ్యము. మన మింక మఱలి పోవలసినదే. పాపారాయఁడే కోటలో నున్నచో మనల నల్లుల నలిపినట్లు నలిపివేయకమానఁడు.

విజ—మహాప్రభూ! దేవరవారు దీనికింత చింతింపఁబనిలేదు. పాపా రాయఁడు లేడు. మనకీ యుద్ధమున విజయము సులభసాధ్యము.

లక్ష్మ—స్త్రీవేషధరులీయిద్దఱును బాపురాయునికి వార్తాపత్రికం గొనిపోవుచున్నారని నాతలంపు.

విజ— ఇదియేనిజము. కాని వీరికడ జాబుకనఁబడకుండుటాశ్చర్యము

అందఱు—(వెదకుచున్నారు.)

హైద—(రొట్టె నలిపి తాటీయాఁ ం బట్టికొని) అరేహల్లా! రొట్టెల్ నకుమా జాబుల్ పెట్టి వండినార్. దేఖో మియా! దేఖో దేఖో.

విజ—(పుచ్చుకొని కడిగితుడిచి) అన్నా ఎంతమోసగాండ్రిబొబ్బిలివారు! పిండిలో జాబు పెట్టి రొట్టెకాల్చుట యెచ్చటను జూడలేదు. హా హా హా (అందఱకుం జూపుచున్నాఁడు)

బుస్సి—రాజా! జాబు చదువుము.

విజ—చిత్తము. (చదువుచున్నాఁడు)

నాప్రియమైనబావ పాపారాయనికిరంగారాయఁడువ్రాయువిజ్ఞాపనము.

శా. బావా! రామునిమోసకృత్యమునలో ♦ భస్వాంతులాశాత్రవుల్
వేవేల్ గ్రోవలు గానిత్రోవను దో ♦ ర్వీర్యంబునన్ వచ్చి బల్
తేవం గోటను ముట్టడించి రిపు డు ♦ ద్దీనంబునన్ వచ్చి నీ
చేవం జూపి విపత్తుచుండి తొలఁగం ♦ జేయం గదే నీవరిజన్.

రంగారాయఁడు.

బుస్సి—అమ్మయ్యా! ఇప్పటికి నాకు గుండె నిబ్బరమైనది. పాపయ కోటలో లేనిమాట నిశ్చయమైనది.

విజ—దేవా! నేను మనవి చేసికొనియుండలేదా?

శా. ఏపుం జూపెడునట్టి కొల్లిలుపులి ♦ తేఁ దగ్గిపోనట్టి యా
పాపారాయఁడు లేఁడు వీట నితరుల్ ♦ భావింపగా నెంతవా
రీపట్లన్ నెఱకాఁడు లేని చెలిన ♦ ట్లీకోటఁ జూజాయలన్
జేపట్టందగు నీదు సైంధుల కికం ♦ జింతింపఁగా నేటికిన్.

హైద—పాపయ్యాకీ యింతా ఫికరూ పడతావ్. వాడూకాద్ వాడీ తాతా వస్తేనేమిపోయి చనంలో పేల్చి వేస్తామ్.

లక్ష్మ—

మ. యవనాధీశ్వర ! తాండ్రపాపయ మహాప్రరంభశుంభత్ప్రభా
వవిధిజ్ఞుండని నాకుచుం దెలిసె నీ ♦ వాక్యంబు కాదంచనం
దవులంగాని జయింపరా దతని నీ ♦ దండంతయుం గూడినన్
సవిమర్శంబులు రామరాజునుడు తె ♦ న్నన్ దీని కింతేటికిన్.

బుస్సి—మన కిపు డావిషయమై చర్చింపవలసిన పనిలేదు. పాపారాయఁడు మహాసమర్థుఁడన టన్యోవా రాంశము. ఎదియెట్లయినన తఁడు లేఁడుగావున మనకు విజయంబగు నింక మీరెల్లఁ జింతదక్కి పోరునకుం బొండు. (తెరలోఁ గలకలము)

కావారికుఁడు—(ప్రవేశించి) సలాముూ లేకుం బందగానేయాలీ! కోటల్ కీ దాటి ఆడావాడూ వస్తాడ్. వొకటి బొమ్మ్కా బచ్చాకు తెస్తాడ్. మనవార్ మంసయందోచి వాఁకీ పట్టి తెచ్చాం సెప్పిహార్ సాహెబ్.

బుస్సి—వారిని శీఘ్రమునం బ్రవేశపెట్టుము.

దావా—సిత్తం. సిత్తం. (నిష్క్రమించు చున్నాఁడు)

[అంతచిన వేంకటరావునెత్తికొని దాసీలక్ష్మియుకొందఱుజవానులును ప్ర]

జవాన్—వీసికీ హనుమానంసే పట్టీ తెచ్చినామ్.

విజ—(పరికించి) ఈకుమారుఁడు రంగారాయనికుమారుఁ డనియు నిది మల్లమాదేవిదాసి యనియు నే నూహించితిని.

బుస్సి—(వారిం దిలకించి) ఓసీ ! ఈకుమారుఁ డెవరు? నీవెక్కడికి వీనిం గొనిపోవుచుంటివి ?

దాసి—(వడకుచు భయ మభినయించుచున్నది.)

హైద—దొంగా ధగిడీ యిద్ది దీన్కి పట్టీ కొయ్యవాలా వుంది.

విజ—మ. తళుకుంబంగరు డాలుఁ డీవిడెడు మేల్ ♦ దైవారు నెమ్మోమునన్
నెలనాముద్దులుమూటగట్టుమొగమున్ ♦ సిద్దంపుచెక్కిళ్లుచే
రలఁగోల్పండగుపాలుఁగన్నులునుదో ♦ రంబైనవ్రేళ్ళేతులుం
గలయీపుత్రుఁడు రంగరాడ్విభునకున్ ♦ గాకేరికిం బుట్టునే.

ఇతండు రంగరాయని కుమారుఁడు వీని నిది రక్షించుటకుఁగా నెటకో గొనిపోవుచున్నది.

బుస్సి—ఓసీ నీకు భయము లేదు. నిజము చెప్పుము నిన్ను రక్షించెదను.

దాసి—అయ్యా! నేను—(వడకుచు) మల్లమాదేవి దాసిని. నాపేరు వేంకటలక్ష్మి.

బుస్సి—ఈకుమారుఁ డెవ్వరు ?

దాసి—ఈపిల్లవాఁడు బ్రా—రంగారాయమహారాజుకుమారుఁడు. వీనిపేరు చినవేంకటరావు.

బుస్సి—వీని నెటకుఁగొనిపోవుచుంటివి బ్రాహ్మణ వేషమేల వైచితివి?

దాసి—అయ్యా వీని సంరక్షించుటకు సామర్లకోటకుఁ గొనిపోవుచుంటిని. వీనిం బరాసులు పట్టుకొందురో యని భయంబునం జేసి బ్రాహ్మణవేషము వేసి బిచ్చమెత్తుకొనుచుం బోవుచు నిట్లు పట్టుబడితిని. కోటలోనివారందఱుం గూలిన నీబుడుతం డొక్కఁడైన దక్కనునకొంటి నక్కటా! దైవంబిట్లు సేసె నేనేమి చేయుదును. (దుఃఖించుచున్నది

బుస్సి—కోటలో వారందఱుం గూలుట యేమి ?

దాసి—ఇంత జనంబువచ్చి పడినప్పుడు పురుషు లెల్లరుం జావకుండరని యెంచి కోటలోనిస్త్రీలకు మానభంగ మగునని తలంచి జావ సంకల్పించిరి.

బుస్సి—కటకటా! కోటలో నాబాలగోపాలముగా స్త్రీపురుషజనంబంతయును జావ నెంచిసాహసించియున్నదా? (విచారించుచు) విజయరామరాజా! నీవెంత ఘోరకృత్యంబున కొడిగట్టితివి. బొబ్బిలివారింత శౌర్యవంతులు మానవంతులు అని చెప్పవైతివిగదా? మనము చతురంగబలంబులతోఁ బోయిన వారువచ్చి శరణుజొత్తురంటివిగాని చత్తురని చెప్పక నన్ను మోసముచేసి తీసికొని వచ్చితివిగదా? ఇంక మన మేమి చేయవలయున్నది ?

హైద—దుమ్మాగ్గుల్ వారికీ మీరువిచారం సెయ్యవాలా జరూర్ లేద్. లేకాపోతే వారూ వచ్చీ మనకీ పాద్దనా సెయ్యకా పోర్ మన లచ్చం వారికీ లేద్. మనకీ సంపవాలా వున్నార్.

లక్ష్మ—ఈశేంఢు చెప్పినట్లు వారుపరమదుర్మార్గులు. ఇందఱుమహా రాజులువచ్చి మన దర్శనము చేసినారు. కాని వారు రాలేదుకదా!

క. ఎదిరించునట్టివారల బెదరించి యుడంగఁద్రొక్కి • విత్తవ్యాలిమై
గొదలందఁజేసికూర్చుట పొదలినధర్మంబు గాదె•భువనేశులకున్.

కావున మనమిపుడువారితో యుద్ధముచేసి వారినిసంహరించుటరాజ ధర్మంబుగాని ధర్మవిరుద్ధంబును బాకంబును గాదు.

విజ—మెఱమవా రందఱును నందు విశేషించి రావువారికి దురభి మానంబు మెండు. శౌర్యవంతులమని కన్నుఁగానక ప్రభువులపైఁ బ్రతి ఘటించియున్నవారు. వారినెల్లకం ద్రెళ్ళనేయుట యుత్తమంబ కాని యనుత్తమంబుకాదు. మఱియును,

క. ఈమన్మాత్రుఁడయైన ద్వేషించినవానిఁద్రుంప•విహితముశత్రో
ఛ్చేషంన శేషయేత్తనుభాషణముంవిభూషణమ్ము•ప్రభువర్యులకున్

కావున నీరంగారాయకుమారు నిపు డనుగ్రహించి పుచ్చితిమయేని మన కెప్పటికైన పీనివలన ముప్పురాకమానదు. దేవరయాజ్ఞయేని పీనివిషయ మాలోచించెదంగాక.

బుస్సి—(ఆగ్రహముతో) ఓరిదురాత్మా! నీనాలిక చీలికగాను. రాక్షసాధమా! నో రెట్లు గని పసిబాలుం జంపనీనో రెట్లాడినదిరా? పశుప్రాయుఁడా! నీది బిడ్డలం గన్నకడుపు కాదురా! పాపాత్ముఁడా! ఈకనుగందు ని న్నేమిచేసెదరా? క్రూరుఁడా! ఇట్లుపలికిన ని న్నేమిం చేసెదనో చూడురా?

విజ—[భయ మభినయించుచున్నాఁడు]

హైద—హీవిజయరాజాపబుస్పల్లాధమ్మం సెప్పీనాడ్ గావి దుసరా

లేదే. కోపం సేతు కా వీని రచ్చించావాలా పార్దనా సేస్తాన్ సలాం సేస్తా రచ్చించావాలా. రచ్చించావలా. సర్కార్ !

లక్ష్మ—శతృశేష మగ్నిశేషము వలె నెన్నిటికేని కాల్చిపుచ్చునని యితండిట్లు చెప్పెనుగాని మఱియొక్కటి గాదు. వీనిపైనింత యాగ్రహించుట తగదని విన్నవించుచున్నవాఁడ.

బుస్సి—దానం జేసియా యిట్లుపలుకుట. కానీ వీనినిరక్షించుటయే పరమధర్మముగాని శిక్షించుట ధర్మంబుగాదు. పాతకంబున కాకరంబు మనకీచిఱుతవలనవచ్చునపాయంబును లేదు. వీనిం జూచినప్పటినుండియు నాహృదయంబు దయారసార్ద్రంబై పరికంపించుచున్నయది.

విజ—మహాప్రభూ! నోరులేని పిల్లవాఁడితఁడేమి చేయునసియా? ఇది పులిపిల్ల యేమిచేయునో దేవరయే గ్రహింతురుగాక.

బుస్సి—(శాంతించి)వీనిశౌర్య మెట్టిదో నాకిపుడు చూపఁగలవా?

విజ—చిత్తము. (కుమారుని చంకకరగి) బాబూ! నీ వెవ్వరిబిడ్డవు?

కుమా—నీ కే సెప్ప.

బుస్సి—నాయనా ! మీనాయనగారి పేరెవరు ?

కుమా—సీ—సూచి. నీకుసెప్తా. దంగాదాప్రుగాద్.

అందఱు—(ఆశ్చర్య మభినయించుచున్నారు.)

విజ—(నానాఫలములు, ఖర్జూరములు, బొంగ్నాలు, సొమ్ములు, కత్తులు మొదలైనవి బల్లమీఁద నమరించి) కుమారా! నీకేవి కావలెనో తీసికొని తినుము.

కుమా—(మాఱుమోము వెట్టుచున్నాఁడు)

బుస్సి—బిడ్డా! యిటువచ్చి యిందునీకేమి కావలెనో తీసికొనితినుము.

కుమా—(చంకదిగి యటునడచి కత్తిపుచ్చుకొని మొరతీసి విజయరామునికైచూపి జడిపించి పండ్లు తెగనఱకుచున్నాఁడు.)

విజ—మహాప్రభూ! చిత్తగించితిరా? ఇదిపులిపిల్ల కాని పిల్లిపిల్ల గాదు. మఱి రెండువర్షములు పైఁబడిన మనలఁ బిండివెట్టక మానఁడు. కావున

నామాట విని వీని నేనుఁగు కాల వఁట్టించుటకో పిరంగివాతం గట్టించుటకో ముదల యొసంగుము.

బుస్సి—హాహాహాహా! మహాపాతకవర్తీ! పాపాత్ముఁడా! ఇట్టి లోకోత్తరగుణాఢ్యుఁడగునిక్కుమారోత్తముని జంపు మని చెప్పుచుంటివి! నేను బాపాత్ముఁడనై నీమాట విని వీనిం దల్లిదండ్రులకుం బెడఁబాపితి నక్కటక్కటా! ఇంక నే నీయుద్ధంబు మాని నీరాజ్యమంతయు శౌర్యాధియగు రంగరాయుని కొసంగి నాదేశంబునకుం బోయెదంగాక. (కోపముతో లేచి) హైదరుజంగూ! అన్నము పున్నె మెఱుంగని పసిబాలుం జంపుమని పలుకుసీకిరాతునిం బిరంగివాతం గట్టి ప్రేల్పింపుము. ముమ్మాటికి నాజ్ఞ యొసంగితి వీని నాయెదుటినుండి తొలంగింపుము.

లక్ష్మ—

మ. అవధారో ప్రభువర్య! ఘోరసమరం ♦ బౌసప్పుడిట్లాగ్రహం
బవునే? నీ కితఁడుత్తమోత్తముఁడుగా ♦ కజ్ఞాఁడే క్రూరుఁడే
సవిమర్శంబుగ రాజధర్మమున నీ ♦ చందంబునం బల్కినాఁ
డవమార్గంబునఁ బట్టలే దితని నీ ♦ ట్లాడంగ న్యాయం బటే.

విజ—(బుస్సిదిక్కు మొగంబై)

మ. అపరాధం బొనరించినాఁడ నరిశే ♦ షాపేక్ష నీబాలుఁడన్
గృపలేకజ్ఞుఁడనై వధింపు మనుచున్ ♦ నీచోక్తులం బల్కితిన్
విపరీతంబయి పాపినొద్ద మనుచున్ ♦ వింతల్ జనించెం గటా
కృపతో నన్ను ననుగ్రహింపుమిఁక దం ♦ డ్రీ! తప్పు సైరించుచున్.

హైద—రాజాకా తప్పు లేద్. మెహార్బానీ రఖో సర్కార్!

బుస్సి—మీరందఱు నింతగాఁ జెప్పుచున్నారు గావున నితనిం గటాక్షించితి. రాజా! నీ వింక బుద్ధిగలిగి మెలంగుము. సేనానాయకులార! మీారీకుమారుం దీసికొనిపోయి నాపటకుటీరంబున సంరక్షింపుఁడు.

(అని కుమారుం బొదివి తొడపై గూరుచుండం బెట్టుకొని ముద్దులాడి) కుమారా! నీ కేమి కావలెను? కజాయుంబు వెట్టింతునా? తండ్రీ!

కుమా—ఊహూ! (విజయరాముఁజూపి) పీన్ని కొత్తాలి కత్తియ్య.

అందఱు—(ఆశ్చర్య మభినయించుచున్నారు.)

బుస్సీ—తండ్రీ! నీ పీదాసితో నాయింటికి వెళ్ళి సుఖంబుగా నుండుము. నే నిదె వచ్చి నీ కన్నియు నిచ్చెదను. (దాసి కందిచ్చును.)

[తెరలోఁ గలకలము.]

హైదర—బడాయుద్ధం జరుగుతాదీవుంది మాకీ పోవాలా హుకుందేవ్.

బుస్సీ—సరే! మీ రందఱును బోవచ్చును.

అందఱు—(సలాము చేసి నిష్క్రమించుచున్నారు.)

బుస్సీ—(తనలో) హైదరుడు, విజయరాముఁడును నన్ను మోసము చేసినమాట నిజము. బొబ్బిలిరాజులు నిర్దోషులు; అభిమానధనులు. వారి బ్రతుకుఁదింగుట మహాపాతకము పోరాటంబు మాని వారిరాజ్యము వారి కిచ్చి పోవుదునా? (ఆలోచించి) ఇంతకు వచ్చిన తరువాత నేను వెనుకదీయుట మంచిది కాదు. నన్నెల్లరును బిఱికివాఁ డందురు. కానీ! కానున్నది కాక మానదు. (ప్రకాశముగా) లక్ష్మనా! యుద్ధ మెట్లగు చున్నది?

లక్ష్మ—(చూచి) దేవా!

మ. అదిగోచూడుము కోటకొత్తడమునం ♦ దత్యాసాక్ష్వభారీ తుపాకీఁ
బదివేలేన్గుల శక్తిగల్గినటు ద ♦ ర్పంబొప్ప వర్తించు నా
చదురుండే సుమి రంగరాయ విభుఁ డా ♦ చక్కిన్ మహాశౌర్యసం
పదతోఁ గల్చిన యోధులే తెలియు ధ♦ర్మారాయముఖ్యుల్ ప్రభూ!

బుస్సీ—ఆహా! రంగరాయుని శౌర్యమెల్ల మూర్తీభవించినట్లు కన్పట్టుచున్నాఁడు. వీనిదర్శనంబు నంజేసి నాకన్ను పండువ యైనది. (పరికించి) ఓయి! మన సేనలు పాఱుచున్న వేమి?

లక్ష్మ—

మ. నరసారాయఁడు ధర్మరాయఁడను జి ♦ న్నారాయఁడుందొట్టిపో
టరు లెల్లం జెల రేగి తెంపు మెయిఁగో ♦ టన్ వీడిపై వచ్చి మేల్
కరవాలంబులు నీటెలన్ సురియలన్ ♦ గైకొంచుఁ బోరంగ హై
దరు మఖ్యల్ వెఱఁగందిపాఱెదరదే ♦ ధైర్యంబు వోనాడుచున్.

బుస్సి—చీచీ! మనసేన కాలినట్లైయున్నది. అదిగో హైదరుజంగు విజయరామునితో నేమో ఘోషించుచున్నాఁడు. విను.

లక్ష్మ—హైదరుజంగు సైన్యమంతయునుం జెల్లాచెదరై తాను దెబ్బలు తినియున్నవాఁడగుటంజేసి విజయరామునితో నిట్లు పలుకుచున్నాఁడు.

ఉ. మాయలు కొన్నిపన్ని మది ♦ ప్రమాదపడఁ జేసి దురం బొనర్ప న
న్నాయితపెట్టి పాపమున ♦ యందు బడల్ కడఁజేసి నీవుఁడా!
రాయల కొంపఁ దీయుటకు ♦ రాజ నటించుచు విఱ్ఱవీఁగునీ
వీయెడఁ జాతి నోఁదగునె ♦ హీనమగాదె కులం బునీతికిన్.

విజ—(పాడకట్టి)

ఉ. ప్రాణము తీపుగాదె యెటు ♦ వంటి పరాక్రమశాలియైన నా
రాణువ యంతటంబం దెగియె ♦ రాజుపరాక్రమ విక్రమంబునన్
ద్రోణుఁడు వోలెఁ దెంపుమెయిఁ♦ద్రోపడఁజేయుచు వచ్చుచుండె గం
భీరముఁ లేన్గులుం దెరలెఁ ♦ గాల్బలమింబరు వెత్త కెట్లగున్.

బుస్సి—విజయరాముని పరాక్రమం బింతటిదియా? చాలుచాలు రంగారాయఁ డేమో పలుకుచున్నాఁడు సద్దుచేయకుము.

రంగా—(పాడకట్టి)

చ. నిలునిలు నీచరాజ! నిను ♦ నీ బలగంబును బిండిపిండిగా
నలిపెదఁ గాళ్ళఁ జేతులను ♦ నాబలమెల్ల జనుల్ నుతింపగా
వెల లెద వేల సంగరము ♦ పెల్లభిమానము వీటబుచ్చి; బ
చ్చులకడఁ జేరి యిచ్చకముఁ ♦ జూపుచుగా దిది విచ్చకత్తిరా.

లక్ష్మి—దేవా! నరసరాయుఁ డేమో విజయరాయునిఁ దిరస్కరించి పలుకుచున్నాఁ డాకర్ణింపుము.

నర—సీ. ఓరి విజయరామ! ♦ పాత దేబర మాట
లాడి నవ్వె యనుచు ♦ నైతి వేమొ
గంపసిరులు గావు ♦ గాలంపు సిరు లివి
చక్కనిలువము నిన్నుఁ నుక్కడంతు.

బుస్సి—ధర్మారావు హైదరు దిక్కు తిరిగి నాఁ డది విను.

ధర్మా—(పాడకట్టి)

చ. తులువ కళింగరాజునకుఁ ♦ దోడ్పడి నన్నపు డీవు పట్టుకోఁ
దలఁచి యనార్యమున్ సలుపు ♦ దారి మెలంగితి వేమియయ్యె నీ
బిలుకురఁ జేసెదం దురక ♦ బిడ్డవయేని భయంబు దక్కనా
కెలన నెదుర్పు మిప్డు పస ♦ కేరిన హైదరుజంగుసాహెబూ.

బుస్సి—చూచితినా సేనలన్నియు మరలఁబురికొని మహాయుద్ధంబు సేయుచున్నవి ? [తెరలో మహాకలకలము.]

లక్ష్మి—హాహా! మహాప్రభూ! కంటిరా ?

శా. ఘోరంబయ్యెదిరంగరాయఁడునుమీఁ ♦ కుంగూర్చులాల్కడునుక్
హాహారా హెహారిఁ బెనంగి శస్త్రములతో ♦ నుక్కెక్కి తారాండారుల్
బారీటుల్ గొని వైచికొంచు ధరణీ ♦ భాగంబునం గూలి రా
హారావం బుదయింప నొక్కపరి యో ♦ ధాగ్రేసరుల్ భీతిలన్.

బుస్సి—హాహా! రంగరాయమహారాజ! భూమండలాఖండలుండవన నొప్పు నిన్ను నే మూర్ఖుండనై నిధనంబు నొందించితిఁగదా! నేనెంతపాపాత్ముఁడను. నీవెంతపుణ్యాత్ముఁడవు. మమ్మీఁ దుచ్ఛలోకంబునం బడవైచి నీవు వీరస్వర్గ మనుభవింప నేగుచుంటివా? పుణ్యరాశీ! మీ రెంతపుణ్యవంతులో మీకాంతలు కూడ నంత పుణ్యవతులే. వారి చావునకును నేనే కారణంబయితిని గదా! హాహాహా! [విచారింపను

[తెరలో మరలఁ గలకలము.]

లక్ష్మ—అయ్యా! చూడు మదిగో మహాక్రోధముతో నభిమన్య ననుకరించి వెంగళరాయఁడు సపరివారంబుగా హైదరుజంగు దిక్కు-మొగంబై వచ్చుచున్నాఁడు.

బుస్సి—ఏదారి నెట్లు వచ్చుచున్నాడు ?

లక్ష్మ—పక్షద్వారమునుండి కోటవెలుపలకు వచ్చి తన్నుఁ జంపఁ బొంచియున్న చిన్నబిలాలు నెక్కియేటున రెండుతుండెములుగా నఱికి పండ్రెండువేల మందిని జటాపంచలు గావించి గవ్యూతిదూరంబు పాఱఁ దోలినాఁడు.

బుస్సి—ఆహా! వెంగళరావు పరాక్రమము! వేయిమందితో నన్ని వేలం దూలఁదుచ్చినాఁడా ? తరువాత ?

లక్ష్మ—మరలి వచ్చునపుడు పొంచియుండి విజయరామరాజు వేగుర మోసంబున నాశనంబు చేసినాఁడు.

బుస్సి—చీచీ ! విజయరామఁ డెట్లుచేసినాఁడు! పరాక్రమ మున్న యెడల నెదుటఁ బడి పోరరాదా? తరువాత?

లక్ష్మ—అందు వెంగళరాయప్రభృతులు పండ్రెండ్రు గురుమాత్రము మిగిలిరి. వారే మఱికొందఱిం గూడుకొని త్రోక్కఁ ద్రొక్కిన త్రాచుల వలె నాలుకలు గోయుచు విజయరామసైన్యంబు దైన్యంబు నొందించి యిట వచ్చుచున్నారు. [చెప్పినట్లు వేంగళరాయాదులు వ్రి॥]

వెంగ—ఓరోరి విజయరామ ! ఓరి హైదర !

ఉ. పాపులు పాపరూపమునఁ ♦ బాల్పడి బుస్సికి బోధచేసి మీ
రీపగిదిం దురంబునకు ♦ నీబలగంబుల నెల్లఁ దెచ్చి మా
పాపలఁ గ్రేపులం గొలము ♦ వారల నెల్లరఁ గూల్చ నెంచిరా
మీకపసపట్టెదర్ మగఁటి ♦ మిర్ నిలుఁ డిప్పుడు నేను వచ్చితిన్.

ఉ. మోసము చేసి లాలుసర ♦ పుంగవు రంగ మహీంకళత్రుఁ జా
నేసెను దానఁ దీరునని ♦ యెల్లనటంచును గర్వితాత్ములై

యోసరఁబోకుఁ డీవెలమ ♦ యోధులు కత్తుకఁ బ్రాణముండగా
వీసము తీసిపోరు మిము ♦ వీసర ప్రుత్తురుగాని వ్రేల్మిడిన్.

హైదర—(పాఱిపోవుచు విజయరామరాజుదగ్గర) నాకీ పానసంకటం వచ్చిందీవుంది నీకీ నమ్మా నేన్ పిల్లల్కీ మేల్కీ సెడ్డాన్. నీవు బడా లష్కర్ కలవాడూ మాటనమ్మేన్. ఇంకా నానసీబ్ చెడ్డాదివుంది. నాకీ నూకల్ సెల్లిపోయింది చావూ రాసిందీ నిజం గవాచ్చారం యేమీ సెప్పవాలా రాజా ! [పాఱిపోవుచున్నాఁడు.]

[తెరలోఁ గలకలము.]

బుస్సి—మన సేనలు మఱల నెదురుకొనుచున్నవి చూచితిమా.

లక్ష్మ—చిత్తము. వేంగళరాయఁడు వెన్నంటివచ్చుచో హైదరాడిన మాటల కభిమానంబు వొడమి విజయరామరాజు డెందురుకొనియె. అప్పు డెల్ల సేనలు తిరుగఁబడినవి.

బుస్సీ—అరేరే! అదిగో వెంగళ్రాయఁ డెల్లర నల్లు నలిపినట్లునలిపి సింగంబు లేళ్ళఁదోలినట్లు తోలుచున్నాఁడు. హాహా వెంగళ్రాయని శౌర్యమనివార్యముగదా !

లక్ష్మ—సందేహమా ? ప్రభువరా !

మ. కలనం బాపఁగలేడుగా కతఁడు వే ♦ గళ్రాయఁడుం గూడినన్
గలశాబ్ధి న్మథియించు మంథరమునాఁ ♦ గల్లోలముం జేసి నీ
బలమెల్లన్ నశియించి పోవ సురనున్ ♦ వర్తింపఁగాఁ జేయరే
వెలమల్ ధైర్యహిమాద్రులందుఁ బ్రబలుల్ ♦ పేరెన్నలోకేశ్వరా.

బుస్సి—వీఁ డెవఁడు కొండం దగరుపోలె వెంగళ్రాయనిం డీకొనుచున్నాఁడు ?

లక్ష్మ—వాఁడే సిద్దిబిల్. దేవా! చిత్తగింపు మెట్టిఘోరయుద్ధమగుచున్నదో! ఇరువాగునుం బోరుచుండునపుడు వెంగళ్రాయు పోటులు బిలాలు లాటీతోను బిలాలునటుకులు వెంగళ్రాయు డాలుతోను గాచు

కొనుచు నందఱను మెప్పుపుట్టించుచున్నారు. ఇపుడు బిలా లిట్లుపలుకు చున్నాఁడు విను.

"శా. ఎన్నో కోటలు ముట్టడించితిమి మేమెన్నో మహారాష్ట్రముల్
విన్నాణంబుగఁ గొంటి మెన్నొదురముల్ ♦ లీలాగతిం గంటి మీ
సన్నాహంబుచు శౌర్యమొందుఁగన మ ♦ జ్జా! వేంగళాధీశ్వరా
నిన్నుంజూచిన గుండె బ్రద్దలగుచుం ♦ డెన్ నాకు వేయేటికిన్."

లక్ష్మ—హరహరా! ఎంత ఘోరకృత్యము జరిగినదో చూచితివా మహాప్రభూ! బిలా లిట్లగ్గించుచుఁ బరాయత్తచిత్తుండై యున్నతఱి వెంగళార్యయు నొక వేటు వేసినాఁడు. దాన నతని చొప వ తెగిపడినది.

బుస్సి—చీచీ! బిలా లెట్టి పని చేసినాఁడు?

లక్ష్మ—ఆవింతచూడు. తెగపడిన చొపముఁ గట్టుకట్టించుకొని వెంగళార్యు వానిమీఁదికెట్లుఱికి పలుకుచున్నాఁడో చూడుము.

వెంగ—(కనుపడి) ఓరోరి దుర్మార్గుడా!

మ. నను నగ్గించుచు నేఁ బారాను పడియుం ♦ డంజెంప యూహింగఁజో
రుని చందంబునఁ గత్తిని స్వసరితో ♦ రోరీ! మనుష్యాధమా
నిను వీరెల్లరుఁ జూచుచుండ నిదిగో ♦ నే నీక్రపాణంబు నం
దను వింతింతలు చేసి కూల్తుకుణమా ♦ తో రాలిం గాచుకో.

(కత్తి దూసికొని పఱనుచున్నాఁడు తెరలోఁ బెద్దకలకలము.)

బుస్సి—లక్ష్మనా! సిద్దిబిలాలు పనియైనట్లుదే అయ్యో! మన సేన కెంతవిపత్తు వచ్చినది?

లక్ష్మ—దేవా! ఒక్కసిద్దిబిలాలు కూలుటయే కాదు. వెంగళార్యుని వేటులకు మన సైన్యం బంతయు దైన్యంబునొందె. జంగ్డాల్ జానూఖాన్ ప్రభృతి ప్రధానయోధులు నిధనంబు నొందిరి. హైదరు జంగు ప్రాణావశిష్టుండై పఱచెను. విజయరామరాజు చావఁ దెబ్బలు తిని పాఱినాఁడు మనవారి దెబ్బలను బొబ్బిలియోధు లెల్లరును

ప్రాణంబులు గోలుపోయిరి. అదిగో బిలాలు కొట్టిన దెబ్బ భరింపలేక వెంకట్రాయఁడును బడియున్నవాఁడు.

బుస్సీ—హాహా! యెంత ఘోరకృత్యము సంభవించినది. లక్ష్మణా! మన మటకుఁ బోవుదము లెమ్ము. (లేచి కొంచెము నిష్క్రమించుచున్నారు) (అపటిక్షేపంబునఁ బూర్వోక్త క్రమంబున హైదరును వెంకట్రాయండును గనుపడుచున్నారు)

బుస్సీ—(వెంకట్రాయుని చెంతకరిగి) హా హా! మహారాజ! నేను మూసాబూసిని నిన్నుఁ జూడవచ్చితిని నన్నుఁ గన్నెత్తి చూడుము.

వెంక—(చూచి సంజ్ఞగా సలాము తెల్పుచున్నాఁడు.)

బుస్సీ—వెంకటరాయా! నీపరాక్రమం బగ్గింప శక్రాదులకును శక్యంబు కాదు. హా హా! ఒకచోప తెగియు నీవట్టి విక్రమంబు గావించితివి. నీయన్న రంగారాయఁడు మహాపౌరుషవంతుఁడు. హైదరు దుర్బోధన బునం జేసి మిమ్మిట్లు చేసి దోసంబు గట్టుకొంటి. కడచిన దానికిపుడు చింతించి ప్రయోజనంబు లేదు. నీవు చింతింపకుము. నిన్ను నా చెంతఁ బెట్టికొని ప్రణౌషధంబు వేసి సంరక్షించెద భయంబుడుగుము. (హైదరు చెంతకఱిగి) హైదరుజంగా! నీ కెంతయవస్థ పట్టినది! దీని కంతకును గారణ మీవేకదా! నీ వీపాపాత్ముఁడు విజయరాముని మాటవిని యింత తెచ్చితివి. బొబ్బిలివారితో మనకుఁ గలహంబు వలదని చెప్పిన గోరుందొరమాట విననీయక పండువంటి బొబ్బిలివారి సంసారంబంతయుఁ బాడుచేయించితివి. పాపం బంతయు నీవును విజయరామరాజునుం బొందెదరు గాక. (విజయరాముం జూచి) రాజాధమా! స్త్రీ బాల వృద్ధసమేతంబుగా నిష్కారణ మిన్నివేల మందిని జంపించితివిగదా! స్త్రీజనంబు చిచ్చుపెట్టుకొని చచ్చునప్పుడు కోటలో మంటలేమని నిన్నడిగినఁ బెండ్లివేడుకలని యెన్నో వారినేరంబు లుగ్గడించితివి గదా! మనము బోంట్లు నిన్నుంజూచి నీతోఁ బ్రసంగించిన మహాపాత

కంబు చుట్టుకొనును. అట్లని యిప్పుడు నేఁ జేయవలసిన దేమియును లేదు గావునఁ బీరంగు వెంటనైన కోటం జూడఁబోవుదము పరిశుద్ధంబు చేయింపుము.

విజ—(తనలో) ఇప్పటికి నాకుఁ జావు బ్రదుకులమీఁద బొబ్బిలి కోటలోఁ బ్రవేశించు భాగ్యంబు పట్టినది. (ప్రకాశముగా) దేవరవారి యాజ్ఞాప్రకారము గావించెద.

బుస్సి—లక్ష్మనా! వెంగళరాయుని హైదరుజంగుని బటకుటీరంబులు చేర్పింపుము. [తెరలో]

చ. జగమున కెల్లఁ జుట్టమును ♦ జక్షువునైన కని పెంచు భాస్కరుం
డగముల పాలు చేసి తను ♦ జాగుల తేజము దూలిపో ఘనం
బగుతమ మావరించు కొన ♦ నారసి లోపముదీర్ప దర్ప మొ
ప్పగ నవగమ్మై కళాధిపుఁడు ♦ వచ్చెను నాఁ బొడకట్టె నియ్యెడన్.

బుస్సి—సాయంకాలముగుట వినఁబడుచున్నది. విడిదలకుంబోదమా

లక్ష్మ—చిత్తము. (బుస్సితో లేచుచున్నాఁడు.) [తెరపడుచున్నది]

ఇది పంచమాంకము.

---

# బొబ్బిలి యుద్ధనాటకము.

## షష్ఠాంకము.

---

స్థలము రాజాము నందలి రాజభవనము.

[అంతటఁ గాసా రామునితోఁ దాండ్రపాపయ్య ప్రవేశించుచున్నాడు]

పాపా—రామా! నేఁడేమో నామనం బాందోళంబు నొందుచున్న యది కారణ మేమైయుండును?

చ. అనుకులు దిన్నయట్లు మది ♦ నారట మెచ్చుచుగుండెజల్లుమం
చడరెనుఁ జల్ల చిల్కుకటు ♦ లయ్యెడు లోఁ దిగు లెచ్చుచున్నచోఁ
గదుకొని యుంటకుఁ హితవు ♦ గా దెదిలోఁపను తావమాగకం
బుకుకఁగఁ జేయు మిన్నియును ♦ నోయని బీకగు నాకునెత్తిఱీ.

పరాసులు మూకలు వారిం దేవులపల్లిఁ జేరిన ట్లిప్పుడే సమసమగాఁ దెలియవచ్చినది. దుష్టాత్ములవారేమేమికష్టకార్యములు చేసియుండరు గదా? నాదేహమాత్ర మిప్పుడు బొబ్బిలి యంతయుం దెగ నన్నంత వణకుచున్నది. దీనికేమికారణమైయుండునో తెలియరాదు.

రాము—మహారాజ! వేయికన్నులతో నీవుచూచి రక్షించుచుండ బొబ్బిలిపై నింగమైన ప్రాబల్యములునా? పరాసులు దేవులపల్లి వెళ్ళినను మళ్ళిరావలసినదే కాని మనయోధుల నేమిచేయఁగలరు? ఇప్పుడునీకింక చిత్తవికారమున్నను గారణమ్ము లేదు. ఉపశమించి వేగులవారిం బుచ్చి వారు దేవులపల్లికివచ్చుటం గూర్చి నిశ్చయానిశ్చయంబు తెలిసికొని పిమ్మట కార్యంబు దెసం బ్రవర్తించుటుచితంబని నాయభిప్రాయము

పాపా—సరే! నీవుచెప్పినది మంచిపద్ధతియే, అట్లుచేయుదముగాక. (విని) హాజారముకడ సందడియేమో చూడుము.

రాము—చిత్తము (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) రాజా! మన భీముఁడు వచ్చి హాజారముకడ వేచియున్నాఁడు

పాపా—వాని శీఘ్రమునం బ్రవేశపెట్టుము

రాము—(నిష్క్రమించి భీమునితోఁ బ్రవేశించుచున్నాఁడు)

భీము—(దుఃఖముతో పరుగెత్తుచు) అయ్యో! అయ్యో!

పాపా—ఏమిరా! అది? అట్లు బెగడొందుచుంటివేమి? నీకాయమునం గాయము లగపడుచున్నవి పరాసులు నిన్నుఁ బ్రహరించిరా యేమి? వారెక్కడకు వచ్చినా రెక్కడనున్నారు?

భీము—అయ్యో! బాబయ్యా! అంతయుం బోయినది?

పాపా—ఆఁ! ఆఁ! ఏమిరా! అది? ఏమిరా! అది?

భీము—విజయనగరమురాజు పరాసులను మాఱుదాఁ దెచ్చి కోట ముట్టడించి, అందఱను హతము చేసినాఁడు బాబూ! చావుతప్పించుకొని యేలాగో బైటఁబడి నేను మీతో మనవి చేసికోవచ్చినాఁడ.

పాపా—హాహాహాహా! పరమేశ్వరా! (పడిమూర్ఛిల్లుచున్నాఁడు)

రాము—(దుఃఖించుచు సేద దేర్చుచున్నాఁడు.)

పాపా—(సేదదేరి లేచి కన్నీళ్ళతో) అందఱను హతము చేసినాఁడంటివేమిరా అది? ఎట్లయినది? ఏమివృత్తాంతము?

భీము—బాబూ! పరాసులు వచ్చి మూఁగినతోడనే మనదొరగారినోష్టి రాయబారము లంపినారు. దానికి వారంగీకరింపక యుద్ధము చేసినారు. అందఱి ప్రాణములు పోయినవి.

పాపా—హాహా! పరమేశ్వరా! (పడి మూర్ఛిల్లుచున్నాఁడు.)

రాము—బాబూ! దుఃఖించిన ఫలము లేదు మీయట్టిపురుషాగ్రగణ్యుల కిట్లు తగదు తెమ్ము తెమ్ము కార్య మాలోచింపుము.

పాపా—(లేచి దుఃఖముతో) మనరంగారాయప్రభృతులందఱుం గాలధర్మము నొందినారా?

భీము—బాబూ! అందఱును.

పాపా—

శా. హాహా! సద్గుణమూర్తిసర్వనుతశౌర్యస్ఫూర్తి! రంగాధిపా!
బాహాబాహిఁ బెనంగి నీ వరులగర్వం బెల్ల మాయింతువా
ద్రోహుల్ నిన్నును మోసఁ జేసి కలనన్ దూలించిరే నీకు

దేహంబుఁ విడుపాటు వచ్చెనోటా! ♦ దీనుండవై పోయితే.

చ. తొరపడఁ గూడదెంకు న ♦ ని తొల్లి సుమూర్ఖ వచియింతువట్టినీ
వరులను శాంతిఁ జేసి కొను ♦ నట్టివిధంబునఁ బుట్ట కీసునం
దుర మొనరింప నేల నను ♦ దోఁడుగఁ బిల్వవదేటి కయ్యరో
ధర బెడఁ బాసి స్వర్గపురి దా ♦ రిని బట్టితెరంగ భూపతీ.

సీ. నీశౌర్యధైర్యముల్ నీప్రభావంబును,
మంటిపా లయ్యెసే ♦ మానవేంద్ర!
నీగాంభీర్యంబు ♦ నీమశౌర్యంబును,
బూదెపాలయ్యెనే ♦ పుణ్యమూర్తి!
నీసద్గుణంబులు ♦ నీయోగ్యవర్తనం,
బడవిపాలయ్యెనే ♦ యనఘకీర్తి!
నీసాహసంబును ♦ నీశరీరంబును,
జముని పాలయ్యెనే ♦ చక్రవర్తి!

గీ. కటకటా! సర్వజననాశ ♦ కాల మిపుడు
వచ్చియున్నదిగా బోలు ♦ వసుమతీశ!
కాకయుండిన నిక్లేల ♦ కలను హెచ్చు
నేను బెడబాసి యుండుటే ♦ దేలవచ్చు.

ఓరీ! సర్వజననాశమైనదని చెప్పుచుంటి వంతఃపురాంగన లెట్లున్న వారు? వారి కవమానంబు వాటిల్ల లేదుకదా?

భీము— లేదయ్యా! లేదు. దొరగారు వారి కందఱను జెలికాని వెంకయ్యగారిచే నఱికించినారు మల్లమాదేవి తనంతఁ దా నఱకుకొని ప్రాణత్యాగము చేసికొనియె. దాదులునుం జావనెంచిన వారిం జిచ్చు వెట్టి కాల్చివేసినారు దేవా!

పాపా— హాహా! నాసహోదరీ! మల్లమాంబా! హాహాహాహా!

(పడి మూర్ఛిల్లుచున్నాఁడు.)

రాము— రాజా! శాంతింపుము శాంతింపుము (సేదదేర్చుచున్నాఁడు)

పాపా— [సేదదేరి కన్నీళ్ళతో] అమ్మా! మల్లమాంబా!

గీ. అనదవై చాలఁ దపియింప ♦ వైతివమ్మ

మానహానికి శంకించి ♦ మసిసితమ్ము
కొడుకుగతియేమిగాఁజేసి ♦ నడచి తమ్మ
మల్లమాదేవి! నను గన్న ♦ తల్లి! నీవు.
అయ్యో! నా ప్రియసహోదరీ!
చ. ఒకగడ నేను గన్నడక ♦ యుండినఁ దమ్ముఁడ! పాపరాయఁడా
సుకముగ నుంటివయ్య! నన ♦ జూడఁగ రా వదియేమి బావతో
నెకసకియంబులా! యనుచు ♦ నెప్పుడు నన్ను దయార్ద్రదృష్టి వీ
డక కనుఁగొంచు తల్లి వక ♦ టా! యివి కేగితె మల్లమాంబికా!
ఓరీ! సేవకా! ఇంతపని జరుగునప్పుడునా కేలనార్తనంపలేదురా?
భీము — బాబూ! పంపినారు. వార్తాహరులాడవేషములు వైచికొని వచ్చుచుండఁగా విజయరామఁడు వారిం బట్టికొని శిక్షించినాఁడుసామీ!
పాపా — అన్నా! ఎంత పనిజరిగినది! ఎంతపని జరిగినది! దుర్మార్గుఁడట్లు చేసినాఁడా? కానీ కుమారునిగతి యేమైనదిరా?
భీము — ఆవూరబిడ్డకు బాపనవేషము వేసి దాసీలక్ష్మిగారు సామర్లకోట కంపుచుండఁగా బుస్సిపట్టుకొని తనయింటం బెట్టుకొని రక్షించుచున్నాఁడు.
పాపా — అమ్మయ్యా! వంశాంకురము వాఁడైన జీవించియుండెనని విన్న నామనసుకి తెనుమ్మగలిగినది. పట్టుకొని రనునంతలో చంపిరని చెప్పుదువే యనుకొంటినిరా సేవకా!
భీము — అంతపనియు జరిగినదే విజయరామఁడా బాలుని నేనుఁగుకాల మట్టింతు ననెం గాని బుస్సి దాని కంగీకరింప లేదు సామి!
పాపా — హాహా! మూసాబూసీ!
చ. కలుకుకులంబునం బొడమి ♦ కష్టుఁడవయ్యును దుష్టరాజు పెం
గలుపులఁగాగఁ జిత్తమునఁ ♦ గాంతెడువాఁడవయయ్యెఁ గయ్యపుం
గలకటివయ్యు శత్రుసుతుఁ ♦ గట్టడఁ బట్టియుఁ జంప నిష్టముం
బొలయవు నీదు నమ్మిలిక ♦ నుంగొన సంస్తవనీయమయ్యెడున్.
ఓరిదుష్టాత్ముఁడా! విజయరామ!
మ. కడుపా నీయది ఖండవల్లి మడుగా ♦ గండానిలనుం గంటివా

కొడుకు లేవర నీకు రాకొమరునిన్ ♦ గోయిపంగా నెంతువా
జడబుద్ధీ! పర మాపకారిసగు నిం ♦ జప్పించు కావంతయున్
గడిమిన్ నే నిదె కండఖండములుగ నీ ♦ కాయంబు ఖండింపనే.

సేవకా! మన వెంగళ్రాయునిమాట చెప్పవేమి?

భీము.—దొరా! ఆదొరగారు తనతలసొమ్ము దెగినను దాను చెలికాని వెంకయ్య దామెర దమ్మన్న మొదలగు యోధులతో నెన్నోవేలం గూలనేసి హైదరుజంగుం బడంగొట్టి బిడ్డలలోబులతోంబోరి వానిం జంపి తాను పడెనండు. అపుడా విజయరామరాజు ద్వారకవరకు వచ్చి నీవా రందఱుం బోవ వి చెల్లబెట్టితినవు వేళాకోళముగా నేసినాండంట. అపుడు పడియున్న చిన్నదొర కోపముతో నేం బడినను నాబావ నిన్నుం బడవేయునని చెప్పినాడంట బాబూ!

పాపా.—హా హా! వెంగళ్రాయా! నిశౌర్య మనివార్యము గదా!

చ. తలసగిమూరినన్ మరల ♦ దానిని గిట్టిగం గట్టి లాంబునుం
బిలుకురం జేసి హైదరుని ♦ పీచ మడంచి నిజ గరాజుం గా
లొల్లిందనబాటం జేసి ముసు ♦ కొన్నబలంబుల వేలవేల భూ
తలమునం బండం బెట్టితివి ♦ దారొల్లిన మూర్ఛ మునింగి తేకటా.

మ. నిను నాబావ వధింపు నేం బడిన నా ♦ నీ యంచు నారామరా
జును నోనాడి వధించితప్పటి మహాబ్దీ! ♦ చుట్టూ నన్ నెయ్యమున్
మను జేంద్రుడంను నిన్ను నెల్లరిజనుల్ ♦ నమ్మింప చో వారిం గూ
ల్చిన లాభం బది యేమి సంతసిలినా ♦ లేమి నప్పు డీభూస్థలిన్.

అయ్యో! సేవకా! వేదనాభరంబున నెం డీపాటికి పరలోకమునకుం బోయియుండును. అంతరా విజయరామరాజెంతపని చేసినాండు. బుస్సీ దనమాయలోం బడవేసికొనియెం గదా!

భీము.—వాండు చేసినకీడింతంత యని చెప్ప శక్యమా?

పాపా.—రామా! ఇంక మనకుం గర్తవ్యమేమి?

రాము.—దేవా! నీవు వచ్చి విజయరాముండంపుడు నని మన వెంగళ్రాయుండు గంపెడంతాస వెట్టుకొని యుండెం గదా! వాని మనోరథంబు తీర్చుటయే మనకుం గర్తవ్యము.

పాపా—ఛీ ఛీ! సర్వబంధుజననాశనం బై యున్నయిప్పుడువాం డెట్టివాడైనం జంపిన నేమిప్రయోజనము?

క. శూరుండు పాపారాయుండు వీరుండు నామేనమఱది ♦ విచ్చేసి తర్జి వైరులం జంపె ననుచు రంగారాయండు సంతసింపం ♦ గా లేడుగదా ఇట్టిచో నట్టిప్రయత్నము చేయుట కన్నం దప్పేమియును లేదు కావున మన మిపుడు కాశీప్రయాణము చేయుదము లెండు.

రాము—మన కిపు డాప్రయాణ మంత పోలి యుండదు. రాజులకు శత్రుక్షయంబు చేసి పోరునం దీరుటయే యుత్తమము.

పాపా—(తల వాల్చి కనులు మూసికొని యాలోచించుచు) అక్కా! నీవెట్లుబ్రతికివచ్చితివమ్మా?—నాప్రాణవాయువుల వాయువులలోం గలిపి నిన్నుం జూడ వచ్చితి ననుచుంటివా?—అమ్మా! నాకేమి యాజ్ఞ? నీవు కాశీప్రయాణము మాని విజయరామునిం బరిమార్పు మను చుంటివా? దానంజేసి ప్రయోజనం బేమి?—దుష్టసంహారము చేసి పగ దీర్చుకొనుటయే ప్రయోజన మనుచుంటివా? సరే! అక్కగారి సెలవునకు బద్ధుండనై యున్నాండను (దద్దరిల్లికన్నులువిచ్చి చూచి) రామా! భీమా!

రాము—అయ్యా? యేమి యిట్లు పలవించుచున్నారు?

పాపా—పలవరింతలు గావురా మల్లమాదేవి నాకంటి కగపడి యిట్లు చెప్పెనురా.

రాము—అయ్యో! ఆమెచిత్త మాదుర్మార్గునిపట్ల నెట్లుత్తలం పడుచున్నదో కదా!

పాపా—కాశీప్రయాణము గట్టిపెట్టుదము కాని విజయరామునిం గొట్టుట యెట్లో తెలియకున్నది.

రాము—మనము ముగ్గుర మిపుడు వెళ్ళిరాత్రిసమయంబునవవానిం బట్టికొందము.

పాపా—(ఆలోచించి) రామా! నీమాటవలన నాకశ్వత్థామజ్ఞాపకమువచ్చుచున్నాండురా.

రాము—వారును ముగ్గురే మనమును ముగ్గురమే కార్యమునట్టిదే

పాపా—అది బోనములోని దగునా? రాము—

శా. ద్రోణాచార్యుని పుత్రునంతటి మహా ♦ త్ముం డర్ధరాత్రంబునన్
బ్రాణంబుల్ గనుపాప్మసిల్లఁ బడి దే ♦ హాస్మారకం బేది ని
ద్రాణుం బైనరిపు న్వధించి కసిఁ దీ ♦ ర్పంబోవఁడే నేను నా
క్షోణీశుం దెగటార్చి రాజఋణము ♦ క్తుం డయ్యెదన్ శక్తిమై.

భీము—మేలు మేలు మహారాజ! నే నా విజయరాముని బొబ్బిలి పట్టభద్రుం జేయుదురని విన వచ్చినది. అది కాకుండ నీలో వాని నీ పట్టంబున యమలోకపట్టభద్రుం జేయ వలయు నని నాకోరిక.

పాపా—ఓహో! అట్లయినచో నిప్పుడే ప్రయాణము చేయుదము లెండు.

అందఱు—(లేచి కొంచెము నడచుచున్నారు. తెర లేచును.)

పాపా—సేవకులారా మన మిప్పుడు బొబ్బిలి సమీపమునకు వచ్చితిమి విజయరామరా జిపుడు కోటలోనే యున్నాఁడని తెలిసినది. మన మీయాపములతోఁ బోయినఁ గార్యభంగ మగును. కావున విజయనగరమునుండి వచ్చిన దూతలవలెఁ బోయి రాజుభార్య చంద్రయ్యమ్మ పంపినట్లు చెప్పి జాగరూకులమై వానిం జేరవలెను సుండీ.

రాము—దేవర బాగుగా సెలవిచ్చినారు. అట్లు చేయుదముగాక.

అందఱు—(కొంత నడచుచున్నారు. కోటలో డేరాయందు నిద్రించు విజయరామరాజును గనుపడుచున్నారు)

పాపా—సేవకా! అదిగో వాకిలి కావలివాఁడు నీవు వాఁడు చూడకుండఁ బోయి వానింబట్టి నోరు నొక్కుము. రామా! నీవటకుండి తెర చించుకొని లోనికి రమ్ము.

భీము—(దడాలునం బఱచి కావలివానిం బట్టుకొని నోటగుడ్డ నెట్టి బంధించుచున్నాఁడు.)

పాపా—పులి పులి పులి పులి బొబ్బిలిపులి బొబ్బిలిపులి (కేకలు వేయును.)

రాము—(కత్తితోఁ దెర చించుకొని ప్రవేశించి సేవకులం బట్టి కాటునఁ జంపివేయుచున్నాఁడు.)

విజ— [మొండెమై కనుపడుచున్నాఁడు.]

పాపా-ఉ. వేంగళరాయు నన్నునుడి ♦ వేంకటరావునుజంపుయత్నముఁ
మంగళసూత్రముం బెటికి♦మల్లమదేవిని బోవుతు నంటయుఁ
ముంగల హైదరుం గలికి♦బుస్సికిఁ జేసినదుష్టబోధయుఁ
సంగతిమై భవన్మృతికి♦సాయు మొనర్చెనటంచు నెంచుమా.

ఇక్కడకు నామనోరథపూర్తి యైనది కాని నీపొట్ట చీల్చి పేవులు ధరించి నీరక్తంబు మేనెల్లం బూసికొంట మిగులుఁగా నున్నది.

[కత్తి నెత్తుచున్నాఁడు. తెరపడును.]

ముగ్గురు—[రక్తసిక్తాంగులై పేవులు ధరించి భీమాకారములతోఁ గనుపడుచున్నారు]

పాపా—[హుంకారము చేయుచు]

మ. ఇపుడత్యుగ్రపరాక్రమక్రమములన్ ♦హీనక్రియారంభు నా
నృపులన్ బట్టి వధించితిన్ బవసన్ ♦ నేఁబాపరాయుండ నా
త్రిపురధ్వంసకుఁ డైనశూలియు నన్ ♦దేజంబు దీపింపఁ జ
ట్టుపలన్ గొట్టినవజ్రమైన నెమరన్ ♦ దుష్టుచ్చులం గొట్టనే.

సేవకులారా! మనకుఁ బరమాపకారి యైనహైదరుజం గొంకఁడు మిగిలియున్నాఁడు. వానిం జంపుట కుపాయాంతరం బెద్దియును లేదు గావున మీరు వా యెత్తి పాపారాయఁడు వచ్చి విజయరామునుజంపె నని కేకలు వేయుఁడు.

ఇద్దఱు—ఓహో! హైదరుజంగ! పాపారాయఁడువచ్చి విజయ రామునుం జంపినాఁడోహో! (అని కేకలు వేయుచు ధ్వని చేయుచున్నారు.)

[అంతఁ గొంతసేనతో హైదరు ప్రవేశించుచున్నాఁడు.]

పాపా—ఓరోరి ముష్కరతురుష్కా, ధమా!

క. నేనే పాపారాయుఁడ, నే నెడమైయున్నయపుడు♦ నీబీర మగున్
భూనాథు నడచినాఁడను, రా నన్నున్ మన్నిగొంచు ♦రవరవదీరన్.

[కత్తిదూసికొని కలియఁబడుచున్నాఁడు తెర పడుచున్నది.]

పాపా—(సేవకులతోఁ బైటవచ్చి) రామా! భీమా! ...

చ. మన మిట వచ్చినట్టివని ♦ మల్లమదేవియనుగ్రహంబునన్
గను మొదలించు మార్పలన ♦ గా నొనరించితి మింతయుం గొఱం
తను బడకుండ ధన్యబలము♦తన్మతి కిష్టమునుం గూర్పం గంటి మీ
మనుగడ చాలు స్వర్గపురి ♦ మార్గము వట్టిపోయెం సుఖంతమే.

రాము—రంగరాయాదుల లేనిభూమిపై బ్రతుకుటకన్న నీచ కార్యమున్నదా ?

భీము—నీచు లగుపరాసులువచ్చి పడకమున్న మనమే పొడుచుకొని రంగారాయనిం గలసికొందము గాక.

అందఱు—(కత్తులు సవరించుకొనిపొడుచుకొననుంకించుచున్నారు)

పాపా—[కత్తికి నమస్కరించి] ఓహో! శస్త్రరాజమా !

చ. నినుం గులధర్మమునుం దలంచి ♦ నే నసువై చనునంతనుండియున్
గొనియు మహాప్రభావమున ♦ కుం దగ నీకు నిరర్గళప్రవృ
త్తిని గొనం జేసి ప్రోచితిం గ ♦ దే సకలారిగళాన్నృగాప్తినేం
దనువుం దొఱంగెదం దునిమి♦ధర్మపథం బిదు నాకు శస్త్రమా !

[కత్తి నెత్తుచున్నాఁడు. తెర పడుచున్నది.]

[అంత లక్ష్మన్నతో బుస్సి ప్రవేశించుచున్నాఁడు.]

బుస్సి—లక్ష్మనా! పాపారాయుం డెంతో సేనతో వచ్చి విజయరామునిఁ హైదరుం జంపి మనసేనం బాఱం దోలుచున్నాం డంట ! మన మందుగుండుసామా నంతయు నుపయోగింపుం డని సేన కాజ్ఞాపించితిని. మన కేదో నుపద్రవముగా నతం డిక్క డకు రాడు గద ?

లక్ష్మ—ప్రభువర్యా! పాపారాయునికి సేన లేదు. తనతో నిర్వురం దెచ్చినాఁడు. తనపగతీర్చుకొని తాంబొడుచుకొని కాలధర్మము నొందినాఁడు. నీనీడచూచి నీవు భయపడినట్లు సేన కాజ్ఞాపించితివి. ఎదరిం దమ్ముఱుగక తమలోం దారు గాల్చుకొని పెక్కుమంది చచ్చినారు. మన నూఱువేలకు మూఁడువేలును వారి యైదువేలకు నిద్దఱు ముగ్గురు మాత్రము నిలిచి యున్నారు.

బుస్సి—శౌర్యనిధి యగుపాపారాయునింజూడ్డ నాకు మనము వొడమునున్న దటు నవువుము,

ఇద్దఱు—(నడచుచున్నారు. తెరలేచును. పడియున్న ముగ్గురు కనుపడుచున్నారు)

బుస్సి—[పాపారాయనింజూచి] అరెరే! ఏమియీశౌర్యము! ఏమియీపరాక్రమము! ఏమి యీధైర్యము! ఏమి యీస్థైర్యము! తూకధనుం డగు నిమ్మహానుభావుండు చచ్చియును నాకు మిక్కిలి భయంబు పుట్టించుచున్నాఁడు. రక్తసిక్తంగుఁ డై గుడ్లెఱ్ఱఁజేసి మీసముపై చేయి వైచుకొని పొడువ వచ్చుచున్నట్లే యున్నాఁడు. ఆహా! మహాశూరుఁడా! యెంతసాహసము చేసితివి! నీ విట్టివాఁడ వని నే నెఱింగియు హైదరు మాట విని మోసపోతినిగదా! నీవు సజీవుఁడవై యున్న నిన్నీదేశంబున కధినాథుం జేసి నీవలన మేలు వడయుచుందును గదా! కటకటా! యెట్టిఘోరకృత్యము జరిగినది. లక్ష్మనా! నాకీపాపారాయనిం జూడఁజూడ గుండె పగుల దుఃఖంబు పెచ్చుపెఱుఁగుచున్నది. నే నిట నిలువనోప కున్నవాఁడ పేరోలగంబునకుఁ బోవుదమురమ్ము.

ఇద్దఱు—(నడచుచున్నారు. అపటిక్షేపంబున సభాస్థల మగపడును.)

బుస్సి—లక్ష్మనా! నీవు పోయి చినవేంకటరాయప్రభృతులం దీసికొని రమ్ము.

లక్ష్మ—[చిత్తము. నిష్క్రమించుచున్నాఁడు.

[అంత దాసీలక్ష్మితోఁ జిన వేంకటరావును,కంచుకియును,లక్ష్మనయుఁ బ్ర॥]

బుస్సి—[లేచి కుమారు నెత్తుకొని సింహాసనముమీఁద గూరుచుండఁబెట్టుచున్నాఁడు.]

అందఱు—[కరతాళధ్వనులు చేయుచున్నారు.]

బుస్సి—(కుమారుంజూచి) బాబూ! నీకుఁ గోత్తపల్లిసీమ మొదలుకొని బొబ్బిలిరాజ్య మంతయు నిచ్చితిని. మీ కెప్పటికి విజయనగరమువారి చేతిక్రింద నుండ నక్కఱ లేదు. మీకు మే మెప్పుడును దోడునీడమై యుండెదము. లక్ష్మీ! నీ వీకుమారుం బెంచి పెద్దవానిం జేయుము. కంచుకీ! నీవు కాలముగడపిన వాఁడవు బుద్ధిమంతుఁడవు తగినవారిం బెట్టి రాజ్యానుసంధానము చేయుచుండుము. మేము పోయివచ్చెదము. మఱి నావలన నిక్కుమారునకుం గావలసిన దేదియో చెప్పుము.

కంచుకి—దేవా! నీయనుగ్రహంబున నిక్కమూరున కన్నియు నున్నయవి. అయిన నిట్లుగాఁ బరమేశ్వరుని బ్రార్థించుచున్నవాఁడ.

[భరతపుత్రులిం గలసి పాడుచున్నాఁడు]

మంగళమహాశ్రీవృత్తము.

భూతలమునఁ జనులు♦పుణ్యమునఁ బోఁవుచును♦బోల్పదగు రీతినుపకారం
జేతఁబని జేయునటు♦లీతులు నశించిగుణ♦మేగలుగునట్లుపహితంబుల్
నీతులు పొసంగునటు♦నేలలవి పండిసస్య♦ముండునటు శత్రుభయమింతే
జేతముల నొందనటు♦సిద్ధముగ భక్తివిల♦సిల్లునటు జేయు పరమేశా.

హిం: దూస్థానీ కాఫీ — మిశ్రగతి.

మంగళమఖిలేశా, శుభ—మంగళమఖిలేశా,
గురుతరదురితవినాశా, శ్రీశా, జయ॥ మం॥
పరమపురుష, విగతకలుషఁ పావన గుణభూషా,
వర-భక్తజనాధికపోషా, బహువేషా, సువిశేషా, జయ॥ మం॥

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

ఇది షష్ఠాంకము.

సంపూర్ణము.

-2,

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాల:—రాజమహేంద్రవరము, 1[illegible]

## కలభాషిణీ నాటకము.

ఇది శృంగారపు ముద్ద. స్వర్గలోక వేశ్యకాంతల చమత్కారములు, ఇద్దరు రంభలు, ఇద్దరు నలకూబరులు, ఒకరినొకరు తెలియకచేసిన చేఁతలు మహాద్భుతములు. మృదుమధుర గానము. నారదుని చర్యలు. ఎంతయో వింతగా నానావృత్తములతో వర్ణింపఁబడినది. వెల 0—12—0

## మోహినీ మనోహర నాటకము.

ఇందు కథానాయిక పురుషవేషము వేసికొని తనువరించిన వానియొద్దఁ జేసిన చర్యలు మనోహరముగా, నద్భుతముగానుండును. శృంగారమే యిందు ప్రధానరసము, అనేకచిత్రములున్నవి. వెల 0—8—0

## తిలక్ మహారాజ నాటకము.

ఇందు లోకమాన్యుఁడు చేసినపనులు, వారుపడిన కష్టములు, కన్నులకుఁగట్టి నట్లు సులభశైలిని పదియంకములుగా వ్రాయఁబడినది. సూరతు కాంగ్రెను, దేవాసు కోర్టులోఁ జేసిన డిఫెన్సు, మాండలీజైలు, షష్టిపూర్త్యుత్సవము, నిర్యాణము, చూచి తీరవలెను, చదివితీరవలెను. వెల 1—0—0

## గాంధి విజయధ్వజ నాటకము.

ఇందు మహాత్ముఁడు దక్షిణాఫ్రికాలోఁ జేసినచేఁతలు, పడినకష్టములు, అక్కడి విజయమును, హిందూదేశములోఁ జేసినపనులును, అద్భుతముగా వర్ణింపఁబడియున్నవి, చదివితీరవలెను. వెల 1—0—0

## రాజభక్తి నాటకము.

ఇందు రాజభక్తి యెట్లుండవలెనో, ప్రజలకుఁ ప్రభువుల కన్యాయము రాఁగమన కుఁ గారణమెట్టిదో ప్రభువుల రాజనీతి యెట్లుండవలయునో, అతిచమత్కారముగా వర్ణింపఁబడినవి. ఎల్లరుఁ జదివితీరవలసిన గ్రంథము. వెల 0—8—0

## వేణీసంహార నాటకము.

భట్ట నారాయణ కృత సంస్కృత నాటకమునకు సరిగా సులభశైలిని కవిరాజా గారిచే వ్రాయఁబడిన మహానాటకము. వెల 0—12—0

అన్నిటికిని పోష్టేజి కొనువారలే భరింపవలయును.

వలయువారు:—కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

రాజమండ్రి అని వ్రాయవలెను.

# శ్రీకృష్ణ భారతము.

సంస్కృతభారతములో నున్నట్లు సులభశైలిని రచింపఁబడినది. ప్రతిపద్యమును మృదుమధురముగా నుండును. ఆది సభాపర్వములొక సంపుటము; ఆరణ్యపర్వమొక సంపుటము, విరాటోద్యోగములొక సంపుటము. సంపుటము 1కి వెల 3—0—0

# ప్రద్యుమ్నోపాఖ్యానము.

ఇందు మన్మథుఁడు ప్రద్యుమ్నుఁడై పుట్టి యొకచేఁపచే మ్రింగఁబడుటయు రతి మాయావతియై శంబరునింట వానిం బెంచి పెండ్లిచేసికొనుటయు లోనగు చిత్రములున్నవి. కల్పనలు నూతనపద్ధతిని వ్రాయఁబడియున్నవి. వెల 0—12—0

# ఏకావళీ పరిణయము.

దేవీభాగవతములోనికథఁ గైకొని మనోహరముగా వ్రాయఁబడిన పద్యకావ్యము శైలిమృదుమధురము. వర్ణనము లత్యద్భుతములు. వెల 0—12—0

# ఘటికాచల మాహాత్మ్యము.

ఇది తెనాలి రామకృష్ణునిచే రచింపఁబడినది. అనేకచిత్రవిచిత్ర కల్పనము లిందుఁగలవు. వెల 0—8—0

వేంకటేశ్వరీయము (ద్వారకా తిరుమలస్థల పురాణము). వెల 0—5—0

విజయవిలాసకృతి విమర్శనము. వెల 0—4—0

చంద్రమతీచరిత్రము (కె. విశాలాక్షమ్మగారిచే రచింపఁబడినది). వెల 0—6—0

దమయంతీ చరిత్రము (విశాలాక్షమ్మ కృతము) వెల 0—4—0

రాజ్యలక్ష్మీ పరిణయము. (డిటో) పద్యకావ్యము. వెల 0—6—0

# హిందూధర్మపునరుజ్జీవనము.

ఇది కళా. వేంకటాద్రియ్య బి. ఏ. బి. ఎల్ గారిచే వ్రాయబడిన వచన గ్రంథము. ఇందు సుసంతానముకలుగువిధము. ఆరోగ్యము దీర్ఘాయువుగలుగు విధము. హిందూదేశవైశ్యధర్మములు లోనగువిషయములు విపులముగా వ్రాయ బడియున్నవి. హిందూస్త్రీపురుషులెల్లరును జదువ దగినది. వెల 1—0—0

పైపుస్తకము లన్నిటికి పోస్టేజిప్రత్యేకము.

వలయువారు :—కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు,
రాజమహేంద్రి అని వ్రాయవలెను.